# ఏవరు దొంగ?

## ఇతర నాటికలు

ఆచార్య ఆత్రేయ

దేశికవితా మండలి
విజయవాడ-2

## ఇందులో

నాటికలు:

---

ఎవరు దొంగ?

అంతర్వాణి

వాస్తవం



[ తెర ఎత్తకుండానే నాటకం మొదలవుతుంది. మొట్ట మొదట నాటకం మొదలుపెడుతున్నారని ప్రేక్షకులకు తెలియడానికి— మైక్‌లో ఫలానావారు—ఫలానావారు రచించిన "ఎవరు దొంగ" అన్న ఏకాంకిక ప్రదర్శిస్తారు అని ప్రకటన చేయబడుతుంది. తరువాత బెల్ అయిన వెంటనే పోలీసు విజిల్స్ నాలుగైదు వరుసగా గోలగా వూదబడతాయి. నలుగురైదుగురు బూట్లకాళ్ళతో పరుగెత్తుతూవున్న ధ్వని. ధ్వని రానురాను దగ్గరవుతుంది. కాస్సేపటిలో ఒకడు తెరముందునుంచి వాయువేగంతో పరుగెత్తుకొచ్చి స్టేజి దిగి ప్రేక్షకుల్లోకి వెళ్ళి కూచుంటాడు. ఆ తరువాత ఒకతను పరుగెత్తుకొచ్చి ఆగి అటు ఇటు చూచి, స్టేజి దిగి, ప్రేక్షకుల దగ్గరకొచ్చి ప్రేక్షకులనంతా కలియ చూచి, ముందువరసలో వున్న వాళ్ళను చూచి—]

అతడు: అరె. ఇలా ఒకతను పరుగెత్తుకొచ్చాడు. చూచారండి మీరు? ఇప్పుడే వచ్చాడు. అరె! ఇంతలో ఎలా వెళ్ళాడు? దొంగవెధవ. మీరెవరూ చూడలేదాండి? వాడు దొంగండీ. మనమంతా ఇక్కడున్నామని తెలిసి ఎలా వచ్చాడో వచ్చాడు హాస్టల్లోకి. మెల్లగా అటు ఇటు చూచి స్టోర్సు తాళం పగలగొట్టి. లోపల దూరాడు సార్. రాస్కెల్. నేను కనబడేటప్పటికల్లా పరారయ్యాడు. కాస్త చూడండయ్యా, చూడండి.

[ ప్రేక్షకులలోంచి ఒక కుర్రాడు లేచి ]

కుర్రాడు: అరె! హాస్టల్లో దొంగ. దూరాడా? ఏం పట్టుకెళ్ళాడో! ఇప్పుడే ఇలా ఎవరో పరుగెత్తుకొచ్చారోయ్.

2వ వాడు : (తమిళంలో) ఆమా ఆమా. నాను పాతేన్. ఇప్పిదా వందాన్.

3వ వాడు : (ఇంగ్లీషులో) జస్టు ఐ సా యె ఫెలో రన్నింగ్ దిస్ వే.

4వ వాడు : ఏరా, ప్యాన్సీ డ్రస్ కాంపిటీషన్ కాదుగదా కొంపదీసి!

1వ వాడు : అయితే వార్డన్‌తో చెప్పావా?

అతను : వార్డన్ ఎక్కడ?

1వ వాడు : చూడు, బ్రదర్, చూడు. ఆ మేకప్ రూంలో వుంటాడేమో, పద. పద.

[ఒకటవవాడు, అతడు స్టేజీమీదకు పరుగెత్తుతారు. ఇంతలో వార్డన్ వస్తూ]

వార్డ : ఐ సే, ఏమిటీ గోల? నాటకం జరగనీకుండా. వాట్ ఈజ్ రాంగ్ విత్ యు!

అతను: హాస్టల్ స్టోర్సులో దొంగ పడ్డాడండి.

వార్డ : దొంగ!

1వ వాడు : అవునటండి.

వార్డ : తాళం పగలగొట్టాడా?

అతను: అవునండీ!

వార్డ : మనిషిని చూశావా?

అతను: ఎవడో బెగ్గర్ వెధవండి. రేగ్స్ (చింకి పాతలు) లో ఉన్నాడు.

వార్డ : వాచ్‌మన్ అంతా ఏం చేస్తున్నారోయ్?

1వ వాడు : ఇక్కడ నాటకం చూడ్డాని కొచ్చేశారండి.

వార్డ: నాన్ సెన్స్. ఆ వెధవలకూ వైజ్ఞానిక వారోత్సవాలు కావలసి వచ్చినాయ్ ? కమాన్ కమాన్. వెళ్ళిఅక్కడ ఏం జరిగిందో చూద్దాం రండి. (పోబోతూ, వెనక్కు తిరిగి) మహాశయులారా! యీ అవాంతరం కలిగి నందుకు విచారిస్తున్నాం. తొందరలో ఇంజనీరింగు కాలేజీవారి నాటకం మొదలెడతాం. మీరు శాంత ప్రశాంతంగా వుండాలి. ఇప్పుడే వస్తా. (అని పోబో తుండగా ఎదురుగా పోలీస్ సబిన స్పెక్టర్, కానిస్టేబుల్ వస్తారు.)

వార్డ: పోలీస్ !!!

సబినస్పెక్టర్ : గుడ్ మార్నింగ్ సార్.

వార్డ : గుడ్ మార్నింగ్. ఏం కావాలండీ ?

స. ఇ : ఏం లేదండీ, ఈ హాస్టల్ వార్డన్గా రెవరండీ ?

వార్డ : నేనే, ఎందుకండీ ? దొంగ దొరికాడా ?

స. ఇ : దొంగ ?

వార్డ : ఆఁ దొంగండీ. హాస్టల్ స్టోర్సులో తాళం పగలగొట్టి దూరాడు. మనిషి కనపడేటప్పటికల్లా పత్తా లేకుండా పోయాడు.

[ ఇంతలో లోపల నుంచి ఒక కుర్రాడు పరుగెత్తుకొస్తూ ]

కుర్ర : సార్ ! సార్ !

వార్డ: ఏం ?

కుర్ర : మనం నాటకానికి తెచ్చిన డ్రెస్సుల మూటంతా కన పడ్డం లేదండీ.

వార్డు: వెదకండోయ్? ఎక్కడో వుంటుంది. అన్నీ ఇప్పుడే వస్తాయి మీకు.

కుర్ర: వెదికామండి! ఎక్కడా లేదు. ఇప్పుడే తెచ్చి ఆబైట డ్రెసింగ్ రూమ్‌లో పెట్టాం; ఓ మినిట్ తరువాత చూస్తే లేదు సార్!

వార్డు: చూచారాండి; ఇదీ ఆదొంగే కొట్టేసుంటాడు; సందేహం లేదు.

స. ఇ: దొంగ ఎలా పారిపోయాడో ఎవరన్నా చూచారా?

అతను: ఇప్పుడే ఇలా వెళ్లాడండీ. నేను వాణ్ణి తరుముకొచ్చాను, ఇలా ఆడియన్స్‌లో దూరి వెళ్ళాడు.

స. ఇ: అరె! ఎలావుంటాడో గుర్తుందామీకు?

అతను: కాస్త దూరంనుంచి టార్చివేసి చూశానండి; మనిషి ముఖం కనబడలా! ఒక ముష్టివాడిలా ఉంటాడు. చిరిగిన చొక్కా, చింపిరితల, అయిదడుగుల రెండంగుళాలు లేక మూడంగుళాలు ఉంటాడు.

స. ఇ: లావుగా వుంటాడా, బక్కగా వుంటాడా?

అతను: మీడియం (మధ్యస్థం) గా వుంటాడండి.

స. ఇ: (కానిస్టేబిల్‌తో) ఏయ్! ఈ గుంపులో ఎక్కడన్నా ఉన్నాడేమో వెతుకు.

[ కానిస్టేబుల్ స్టేజి దిగి ఆడియన్సులోనుంచి మెల్లగా జారుకుంటాడు ]

స. ఇ: వాడు వెతికి పట్టుకొస్తాడులెండి; మీరు కాస్త దయచేసి స్టేషన్‌దాకా రావాలి.

వార్డు: దొంగ దొరకండే!

స. ఇ: దొంగ వాడే దొరుకుతాడులెండి.

వార్డ: రేపు మార్నింగు రాగూడదూ? నా కీ పంక్షనుంది.

స. ఇ: లేదండీ! వెంటనే రావాలి.

వార్డ: కాస్తకూచోండి వెళ్దాం? ఇప్పుడు ఇంజనీరింగ్ కాలేజీ వాళ్ళ నాటకం వుంది, చూచి పోదాం. లాస్ట్ యియర్ (నిరుడు) ఫస్టుప్రయిజ్ వచ్చింది వాళ్ళకే. ఈ సారి కూడా మంచి నాటకమే ఆడతారు; చూచి వెళ్దాం; ఏమంటారు?

స. ఇ: నో. ఎక్స్‌క్యూజ్‌మి ప్లీజ్. క్షమించండి. మాకు నాటకాలు చూచే తీరిక లేదు.

వార్డ: పోనీ రేపు మార్నింగువచ్చి రిపోర్టు యివ్వకూడదండీ?

స. ఇ: రిపోర్టు యిదివరకే యిచ్చేశారు. ఇక మీరివ్వాలిసింది సంజాయిషీనే!

వార్డ: ఏమిటీ?

స. ఇ: యు ఆర్ అండర్ అరెస్టు. (మిమ్మల్ని అరెస్టు చేశాం)

వార్డ: అరెస్టు మైసెల్ఫ్! వాట్? (నన్నా ఏమిటి!)

స. ఇ: యు ఆర్ అండర్ అరెస్టు.

వార్డ: ఓ.........

స. ఇ: రాండిసార్, రాండి!

[ఇంతలో ఒక కానిస్టేబిల్ గబగబా వస్తాడు. సబిన్స్పెక్టరుకి శాల్యూట్ కొట్టి......]

కాని: సార్!

స. ఇ: ఏం రా?

కాని : బాపూజీ రైస్‌మిల్లుదాకా వెళ్ళిరావాలి సార్ !

స. ఇ: ఎందుకూ ?

కాని : పెద్ద గొడవ జరుగుతూందండి అక్కడ !

స. ఇ: ఏమిటూ గొడవ ? బందిపోటూ ?

కాని : కాదండి !

స. ఇ. కమ్యూనిస్టుల శాబతేజా ?

కాని : కాదండి !

స. ఇ: మరేమిటి నీ తలకాయ !

కాని : వచ్చి చూడండి సార్ ?

స. ఇ: చెప్పవోయ్, ఏం పరవాలేదు.

కాని : నే సలా మిల్లుదగ్గర నిలబడున్నాను సార్ ! లైట్లున్న ట్టని పించింది. ఏమిటెరా అర్ధరాత్రిలో లైట్లేమిటని కాస్త చెవిపెట్టి విన్నాను స్సార్ ! ఎవరో యిద్దరు మాట్లాడు తున్నారు. ఒకతను "మూటకు అరపడి రాళ్ళు కలిపితే మీ కెంత లాభం వస్తుందయ్యా ? నువ్వు సుమారు 60 లక్షల మూటలు సప్లయి చేస్తు న్నావు. అరవై లక్షల అర్ధరూపాయలు - 30 లక్ష లొస్తుంటే మాకు పదివేలివ్వడాని కేడుస్తావూ ? సరే నీ యిష్టం" అంటున్నాడండి. ఇంకో అతను "మన సంబంధం యీ రోజుతో తీరేదాండి. ఇంకా వుందిగా! ప్రస్తుతం యీ అయిదూ తీసుకోండి మీ ముందున్న ఆఫీసరుగారుకూడా ఇంతే పుచ్చుకొనేవారు" అంటున్నా డండి. ఏమిటో గొడవ !

స. ఇ: ఊం. గొడవ ఏముంది! కరప్షన్ (అవినీతి) ఈలాంటి మనుషులుంటే దేశంలో తిండి ఎందుకుంటుంది? తిండి లేకుండా చస్తారంటే ఎందుకు చావరు? ఛీ...ఛీ... ఆల్ రైట్, రాండి సార్, రాండి.

వార్డు: జస్టు ఎ మినిట్ ప్లీజ్. మహాశయులారా! ఈ నాటక కార్యక్రమం యథాప్రకారంగా సాగుతుంది. ఇంజనీరింగు కాలేజీవారు నాటకం ఆడతారు; సెలవు. (సైడ్ కర్టన్సులోకి చూచి) కమాన్ కమాన్, ఆరంభించండి. తెరెత్తండి, తెరెత్తండి. ఇప్పటికే చాలా ఆలస్యమయింది.

[అని అందరూ వెడతారు; తెర లేస్తుంది]

[ఒక పోలీసు స్టేషను - సబ్ ఇన్స్పెక్టరు వచ్చి కూచుంటాడు]

[ఒక వైపునున్న రిమాండు సెల్లులో ఒకరిద్దరు ఖైదీలున్నారు. ఖైదీలు తెర లేచేప్పటికి]

2 వ ఖై: "దొంగలెవరో దొరలు ఎవరో తెలిసికొనవోయ్ బ్రహ్మయా!

1వ ఖై: అన్నమైతే నేమిరా మరి సున్నమైతే నేమిరా.

2వ ఖై: అందుచేతను పాడుపొట్టకు అన్నమే వేతామురా."

[అని పాడుతుంటారు.]

[ఇంకొక వైపుగా బియ్యపు బస్తాలున్నాయి. కుడివైపునుంచి బావిలో పెద్ద బరువయిందేదో వేసినట్లు రెండుమూడుసార్లు శబ్దం. తరువాత కాపాడుమని ఒక ఆడుదాని కేక. ఈ పాటికే సీటు నుంచి లేచిన స. ఇ. గాబరాగా పరుగెడుతాడు. రిమాండులోనున్న ఖైదీలు ద్వారం దగ్గరకువచ్చి ఆత్రంగా చూస్తుంటారు. బయట ఏదో గోల.

ఇంతలో కానిస్టేబిల్ పరుగెత్తుకొచ్చాడు. టేబిలుమీదనున్న టార్చి లైటు, మూలనున్న చేంతాడు తీసుకొని మళ్లా బయటికి పరుగెడ్తాడు. ఒక్క క్షణం నిశ్శబ్దం. స. ఇ. తొందరగా వచ్చి టేబిల్ మీదనున్న టెలిఫోను తీసుకొని, "హలో! హలో! డాక్టర్. అర్జంటు, కమ్ సూన్ ప్లీజ్" అని టెలిఫోను పెట్టేస్తాడు. గాబరాగా అటూ ఇటూ తిరిగి "చూస్తూ నిల్చుంటారేమిరా ఇడియట్స్, ఫస్టు ఎయిడ్ యివ్వండిరా!" ఇంతలో ఇంకొక కానిస్టేబిల్ వస్తాడు. ]

కాని: ముగ్గురు బిడ్డలు దొరికారండి.

స. ఇ: ఓ మై గాడ్! ముగ్గురు బిడ్డలే? అందరూ చచ్చి పోయేరా?

కాని: చచ్చి ఎప్పుడో పోయారండి.

స. ఇ: ఛీ ఛీ ఛీ, నేను చూస్తున్నా! ఏమిటో యీ స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచీ ఒకటే చావులు, ఒకటే ఆత్మహత్యలు.

కాని: ఇంగ్లీషువారుండగా చావటానికి స్వాతంత్ర్యం లేదండి.

స. ఇ: అయితే ఇప్పుడు స్వాతంత్ర్యం చావటానికి వచ్చిందంటావా?

కాని: ఆ రోజుల్లో మన కాంగ్రెస్‌వాళ్లు ఉపన్యాసాల్లో బానిసలుగా బ్రతికటంకన్నా స్వతంత్రంగా చావటమే మే లనేవారండి.

స. ఇ: కాదురా ఇడియట్! బానిసలుగా పాయసం తాగడం కన్నా స్వతంత్రులుగా గంజితాగటం మేలని.

1వ ఖై: ఇప్పుడు కాయకూరలు తింటమే మేలంటున్నారండి.

[ ఇంతలో డాక్టరు వచ్చాడు ]

స. ఇ: హల్లో డాక్టర్ !

డాక్ట : ఏమిటండి గొడవ ?

స. ఇ: ఆ ఆడమనిషి ముగ్గురు పిల్లల్ని బావిలో పడేసి తానూ పడిపోయిందండి. ఇంకో క్షణముంటే...

డాక్ట : ఏ బావిలో ?

స. ఇ : మన స్టేషన్ బావిలోనండి.

డాక్ట : తప్పుచేసింది. ఏ ఎమ్. ఎల్. ఏ. ఇంటి వెనకాలి బావి లోనో పడివుంటే కొంత ఫలితముండేది.

స. ఇ : ఏముండేది ? తీసేవాళ్ళయినా లేకుండా చచ్చేది.

డాక్ట : మరిప్పుడా మెను బ్రతికించి గొప్ప ఘనకార్యం చేశామను కుంటున్నారా ?

స. ఇ : కాదు మరీ ! ఒక ప్రాణాన్ని కాపాడాం.

డాక్ట : ఎందుకూ, యీ రామరాజ్యంలో ఇంకా పదికాలాల పాటు బ్రతకమనా ? రైట్ రైట్ (వెళ్తూ బస్తాలు చూచి ఆగి, బస్తాలో బియ్యం తీస్తూ) యస్ ఐ గారూ ! ఈ కేసుకు కారణం ఏమిటో చెప్పమన్నారా?

స. ఇ : ఆ, ఏముంటుంది; ఏవో కొంపలో వెధవ గొడవలు.

డాక్ట : (పిడికెడు బియ్యం తీసుకొచ్చి స. ఇ. చేతిలోపోసి) నా చిన్నతనంలో అందరూ అనేవాళ్ళు – అన్నం లేకుండా ఎవ్వరూ చావరు లేరా అని. కాని ఇప్పుడు నూటికి యాభై చావులు అన్నం లేకనే. దేశం మారి పోయింది.

[డాక్టరు వెళ్ళిపోతాడు. స. ఇ. బియ్యాన్ని ఒక చేతిలో నుంచి ఇంకొక చేతిలో పోసుకుంటూ, అలాగే మాస్టూ కుర్చీలో కూలబడ్డాడు. రిమాండులో నున్న ఖైదీలు......]

ఒకడు: ఇదంతా చూస్తూవుంటే జైల్లోనుంచి విడుదల చేస్తారంటే భయంగా వుందిరా!

రెండ: ఆఁ, విడుదలచేసినా ఎంతసేపు. మళ్ళా ఒక్కరోజులో తిరిగి రావచ్చు.

1 వ: ఎట్టా?

2 వ: నీకు తెలియదేం! సులువైన దోవవుంది. ఎర్ర గుడ్డ పీలిక పట్టుకు బయలుదేరావంటే, కళ్ళుమూసి తెరిచే లోపల మళ్ళీ కటకటాలవెనుక వుంటాం.

స. ఇ: (తిరిగిచూచి) ఆ కాలం పోయింది. ఇప్పుడు తుపాకీ పెట్టి కాల్చేస్తాం.

2 వ: అది మరీ సులువుకదయ్యా—ఒకేసారి చస్తాం.

స. ఇ: చస్తాం, చస్తాం. ఏమి టీదేశం? అందరూ ఒకటే చస్తాం చస్తాం అంటారు!

1వ ఖైదీ: బతుకుతాం బతుకుతాం అనటానికి ధైర్యలేదు గనక.

స. ఇ: ఎందుకు లేదోయ్. అనండి; ధైర్యంగా అనండి-బతుకుతామని.

2వ ఖైదీ: మీరీ వుద్యోగానికి చాలా కొత్తగా వున్నారయ్యా.

స. ఇ: ఏం?

2వ ఖైదీ: పాతబడ్డ పోలీసోళ్లెవరూ బతకమని అనలే!

[ ఒక పత్రికా విలేఖరి ప్రవేశము ]

ప. వి: నమస్కారమండి.

స. ఇ: నమస్కారం. రాండి. కూచోండి. ఏమిటి విశేషాలు?

ప. వి: ఏమున్నాయి, మీరే చెప్పాలి. మరి మన పోలీస్ స్టేషన్ బావిలో—

స. ఇ: అవునవును. ఒక తల్లి, ముగ్గురు పిల్లలు పడిచచ్చారు.

ప. వి: చచ్చిపోయారా!

స. ఇ: తల్లినిమాత్రం తీశాం; డాక్టర్ వచ్చారు. బహుశా బతకొచ్చు.

ప. వి: పేపరుకు న్యూస్ పంపించమంటారా?

స. ఇ: పంపండి; ఏం? నన్నడగడ మెందుకు?

ప. వి: అలా కాదులెండి. ఈ మధ్య ఇలాంటి వార్తలు పూర్తిగా బహిష్కరిస్తున్నారుగా.

స. ఇ: ఎవరు?

ప. వి: ఎవరేమిటి? ప్రభుత్వమే. ఇదిగో చూడండి. ఈ రోజు పేపరులో ఏమంటున్నారో మనాళ్ళు— "ఆహార పరిస్థితి గురించి కొందరు విషప్రచారం చేస్తున్నారు. గోరంతలు కొండంతలు చేస్తున్నారు. నిజంలో అంత తీవ్ర పరిస్థితులు లేవు. చిత్తూరు జిల్లా తదితర ప్రాంతాలలో చావులకు కారణం—అన్నం లేక కాదు. ఇతరజబ్బులే. ఆహార పరిస్థితి సంతృప్తికరంగా వుందని గ్రామాలలోనుంచి బాధ్యతకల వ్యక్తులు మాకు స్వయంగా తెలియజేస్తున్నారు" విన్నారా?

స. ఇ: నిజమే! నేనూ యిన్నాళ్ళూ అలాగే అనుకున్నా కాని అదంతా అబద్ధమని ఈనాడు తెలుసుకున్నా!

ప. వి: ఏదంతా అబద్ధమని?

స. ఇ: అన్నం లేనందువల్ల, ఆకలిబాధ కాగలేక మనుష్యులు చస్తున్నమాట యదార్థం.

ప. వి: యస్. ఐ. గారూ!

స. ఇ: ఎందుకలా తెల్లబోతారు?

ప. వి: మీరు గవర్నమెంటు ఉద్యోగులు!

స. ఇ: అయితే నిజం మాట్లాడకూడ దంటారా?

ప. వి: నిజం మాట్లాడ్డమే ఈ రోజుల్లో ఒక విధ్వంసక చర్యగా వుంది.

స. ఇ: నేనిప్పుడు గవర్నమెంటును పడగొట్టాలని ప్రయత్నించటం లేదు. నాకు మంత్రి పదవులమీద ఆశా, వున్న వారిమీద అసూయా - రెండూ లేవు. నేను కమ్యూనిష్టును కాను. కాని నా అభిప్రాయం గవర్నమెంటంటే మనమే. మనమే మన వాళ్ళని చంపుతున్నాం. మనలోనే వున్నారు దొంగలు. మనలోవున్న దొంగల్ని మనం పట్టుకోగలిగితే గవర్నమెంటు దానంతటదే బాగుపడుతుంది.

ప. వి: అయితే మీరు ఆహారసమస్యమీద తీవ్రంగా పని చేయ దలచుకున్నారన్నమాట?

స. ఇ: నా శక్తివంచన లేకుండా!

[ డాక్టరు వస్తాడు. ]

స. ఇ: డాక్టర్! పేషంట్ ఎలావుంది?

డాక్ట: (తాపీగా) ఆవిడ కింక రేషన్ కార్డు అవసరం లేదు.

స. ఇ: వాట్!

డాక్ట: వాట్ లేదు, గీట్ లేదు. ఆహార సమస్యలను అతి సులభంగా పరిష్కరించుకొని వెళ్ళింది.

స. ఇ: అయితే ఆకలితోనే! అన్నం లేనందువల్లనే చచ్చిందంటారా?

డాక్ట: సైన్సుకు తెలిసినంతవరకు అలాగే చెప్తుంది. పత్రికల్లో స్టేట్ మెంట్లూ, ప్లాటుఫారంమీద ఉపన్యాసాలు ఎవరినన్నా మోసం చేయవచ్చు గాని, మెడికల్ సైన్సును మోసం చేయటానికి వీల్లేదు.

ప. వి: డాక్టరుగారూ! మా పేపరుకి ఒక స్టేటుమెంటు యిస్తారా?

డాక్ట: నే నింకా కనీసం ఒక ఎం. ఎల్. ఏ. నయినా కాందే.

ప. వి: ఈ విషయం ప్రజలకు బాగా తెలియటం అవసరం కదండీ!

డాక్ట: చస్తున్నవాళ్ళకి చస్తున్నామని తెలియడమేమిటి? ప్రజలకు కాదు తెలియాలిసింది – ప్రభుత్వానికి.

స. ఇ: డాక్టరుగారూ! అయితే నిజంగా చచ్చిపోయిందంటారా?

డాక్ట: చచ్చిపోలేదు కాని, ప్రాణాలుపోయినయి. (యస్. ఐ. మీదను ఉరికి) నువ్వింకా ఆరౌన్సులు కాదు, బస్తా బియ్యం ఇచ్చినా ఆమె బతకదు.

స. ఇ: (కుర్చీలో కూలబడ్డాడు) ఒకతల్లీ, ముగ్గురు బిడ్డలూ. అబ్బ! ప్రాణాలంటే ఎంత చులకనైపోయింది!

డాక్ట: (యస్. ఐ. వీపుతట్టి) నువ్వు పోలీసు ఉద్యోగంలో ఉండతగ్గవాడివి కావు. నీకేదో కాస్త హృదయం ఉన్నట్లుంది.

స. ఇ: (లేచి పిచ్చిగా తిరుగుతూ) ఇదేనా నా దేశం? ఇన్ని పొలాలు, ఇంత పంట, ఇందరు జనంవుండి ఒక్క ఆడది అన్నం లేకుండా చచ్చిందంటే మనకెందుకు సిగ్గులేదు? మనం ఎలా తలెత్తుకు తిరుగుతాం?

డాక్ట: కాలేజీ నాటకాల్లో ఎప్పుడన్నా వేషాలు వేశావా?

స. ఇ: డాక్టరుగారూ! పరిహాసానికిదా సమయం?

డాక్ట: పరిహాసం కాదోయ్ పిచ్చివాడా! తొంభై మంచి గింజల్లో ఒక్క పుచ్చుగింజ ఎంతో, తొంభై పుచ్చుల్లో ఒక్క మంచున్నా అంతే. నువ్వొక్కడివి ఏం చేయగలవు? లంచగొండితనము, బ్లాక్ మార్కెట్, అధికారం చలాయిస్తున్న రోజుల్లో నీ ఆవేదనంతా నిరుపయోగం.

స. ఇ: అయితే నేనూ యీ ప్రవాహంలో కొట్టుకపోవలసిందేనా! ఏం చేయలేనంటారా?

డాక్ట: చేయగలవు, కాని నీకు ప్రమోషన్లు రావు. నిన్ను ఏ ఎడారికో బదిలీ చేస్తారు. ఇంకా ఇలాంటి ఇబ్బందులెన్నో వస్తాయి.

స. ఇ: ఎన్నోచ్చినాసరే, యీ నిండు ప్రాణాలు తిండి లేకుండా మాడిపోయే దౌర్భాగ్యాన్ని ఆపాలి.

డాక్ట : సరే! ప్రయత్నించు. విష్ యు సక్సెస్; (వెళ్ళి పోతాడు)

స. ఇ: (కాస్సేపు ఆలోచించి కాలింగు బెల్ కొట్టాడు; కానిస్టే బులు వచ్చాడు) ఏయ్! ఆ వార్డన్‌ని పిలుచుకురా!

[ కానిస్టేబుల్ వెళ్ళాడు ]

స. ఇ: (విలేఖరితో) మీరా గదిలో వుండండి. ఇక్కడ జరిగే ప్రతి విషయం తు. చ. తప్పకుండా రేపు పత్రికకు పంపండి: (ప. వి. వెళ్ళాడు. ఇంతలో వార్డన్ వచ్చాడు) వార్డన్‌గారూ ఇప్పుడొక స్త్రీ ముగ్గురు బిడ్డల్ని బావిలో పడేసి తానూ పడి చచ్చిపోయింది. కారణమేమిటో తెలుసా? తిండి లేక.

వార్డ : ఓ! ఈజిట్?

స. ఇ: అవును, యీ తిండి లేకపోవటానికి కారణం ఎవరో తెలుసా?

వార్డ : అదేనండి! మీరు రుండమంటే ఉన్నాను కాను. ఇంజ నీరింగ్ కాలేజీవాళ్ళు ఆహార సమస్యమీద మంచి నాటకం ఆడబోతారు. చూచివుంటే తెలిసేది తిండి లేకపోవటానికి కారణం ఎవరో!

స. ఇ: నాన్‌సెన్స్! నాటకాలు! నాటకాలు! ఆహారసమస్యను నాటకాలటయ్యా పరిష్కారంచేసేది మీలాంటి పెద్ద మనుష్యులంతా ఇలా బస్తాల బియ్యం బ్లాకుమార్కె

టులో కొని దాచేస్తుంటే తిండెలా వుంటుంది? మనుషు లెందుకు చావరు?

వార్డ: ఇదంతా మా స్టూడెంట్సుకోసం కొన్నానండీ. ఇచ్చే రేషన్ చాలటంలేదు. చూడండి! స్టూడెంట్సు ఫ్యూచర్ సిటిజన్స్ (భావి పౌరులు) వాళ్ళకు మంచి సరిప్మెంట్ వుండాలి.

స. ఇ: మీ సమర్థనలన్నీ తరువాత చెప్పుకుందువుకాని ఎక్కడ కొన్నారీ బియ్యాన్ని?

వార్డ: చెప్పాలంటారా?

స. ఇ: చెప్పాలనే అగటం.

వార్డ: చూడండి, ఇది ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్.

స. ఇ: ఇదేనేమో మీరిచ్చే ఎడ్యుకేషన్! అడిగిం దానికి జవాబు చెప్పండి.

వార్డ: బాపూజీ రైస్‌మిల్లులో కొన్నానండి.

2వ ఖైదీ: బాపూజీ రైస్‌మిల్లే! బాపూజీ రైస్‌మిల్లే!

స. ఇ: బాపూజీ రైస్‌మిల్! సరే మీరు వెళ్ళి అక్కడ కూర్చోండి.

[ వార్డన్ వెళ్ళాడు ]

స. ఇ: (బెల్ కొట్టాడు. కానిస్టేబిల్ వచ్చాడు) సుబ్బయ్య చౌదరీని పట్టుకురా. (కానిస్టేబిల్ వెళ్లాడు. మూలనున్న ఒక పెద్ద పట్టాతీసి బియ్యం బస్తాలు కప్పేశాడు యస్. ఐ. ఇంతలో సుబ్బయ్య చౌదరి వచ్చాడు)

చౌదరి: నమస్కారమండీ.

స. ఇ: నమస్కారం, రాండి? రాండి!

చౌదరి: ఏమిటో అంత తొందరగా కబురు పంపారు?

స. ఇ: ఏంలేదు. మీ మిల్లునుంచి ఎన్నిబస్తాలు రవాణా అవుతాయ్?

చౌదరి: సుమారు 60 లక్షలు.

స. ఇ: ఊం! ఎన్నిబస్తాల రాళ్లు సరఫరా చేస్తారు?

చౌదరి: అబ్బే! రాళ్ళెక్కడివండీ?

స. ఇ: పోనీ, మట్టిముద్దలు?

చౌదరి: ఏదైనా పొరపాటున ఒకటి రెండు వస్తే వస్తాయేమో గాని—

స. ఇ: డి. యస్. ఓ, కి ఎంత యిస్తారు?

చౌదరి: జీతమాండి?

స. ఇ: కాదు. అర్ధరాత్రిలో లైట్లు వేసుకొని బస్తా కరపడి రాళ్ళుకలపడానికి ఆయన అనుమతికోసం మీ రిస్తారే సంభావన?

చౌదరి: లంచమాండి?

స. ఇ: ఛ. ఛ. పెద్దవాళ్ళు తీస్తే లంచ మెందు కవుతుందండి?

చౌదరి: అట్లాంటివి మేమింతవరకు ఎరగమండి. రైస్‌మిల్ బాపుజీ చనిపోయిన రోజున స్థాపించామండి.

స. ఇ: బాపుజీ బ్రతికి వున్నప్పుడు స్థాపించినవే కరప్టయి పోతుంటే, చచ్చిన తరువాత స్థాపించిన దాంట్లో తప్పు లేదు లెండి.

చౌదరి: మీరేదో కానివాళ్ళ మాటలు నమ్మి—

స. ఇ: (చాలా సీరియస్‌గా లేచి) చౌదరిగారూ! (పెద్దగా అరిచాడు)

చౌదరి: (కాస్త కంగారుపడి - తెప్పరిల్లి కాస్త విసురుగా) ఏమిటండి మీ బెదరింపులు?

స. ఇ: (తాపీగా) బ్లాక్‌మార్కెట్ చేసిన వాళ్ళను ఉరి తీస్తానని నెహ్రూ ఒకప్పుడు చెప్పాడు.

చౌదరి: ఆ! చెప్పాడు. ఒక్కడిని ఉరితియ్యగా ఇప్పటికి చూడలా!

స. ఇ: అదే పొరబాటు జరిగిపోయింది. లేకుంటే ఈ బస్తాలిక్కడికి వచ్చేవికావు. (బస్తాలుతీసి చూపుతాడు) ఈ బస్తాలిక్కడికి రాకుంటే ముగ్గురు బిడ్డలతల్లి చచ్చేది కాదు. న్యాయశాస్త్రం లేదుకాని, నువ్విప్పుడు నలుగురు ప్రాణాలను ఖూనీచేశావు.

చౌదరి: ఏమండి! కాస్త మర్యాదగా మాట్లాడండి.

స. ఇ: మనుషుల్ని తినేవాళ్ళకు మర్యాదా, గౌరవము, పదవులు ఇవ్వబట్టి మనలోకం యిలా తయారయింది. నేను మీ కాలాంటి మర్యాద యివ్వదల్చుకోలా. (రిమాండ్ సెల్లునైపు చూచి) గవర్నమెంటు తరఫున మీకక్కడ కావలసినన్ని మర్యాదలు జరిపిస్తా. (బెల్లు కొట్టి) వార్డన్‌గారూ (వార్డన్ వచ్చాడు) యీయన్ని మీరెరుగుదురా?

చౌదరి: తెలిస్తే?

స. ఇ: ఏమీలేదు. కాస్సేపు కూర్చోండి. (యస్. ఐ. బైటికి వెళ్ళాడు.)

చౌదరి: (ఇటు అటు చూచి) చెప్పారా ఏం, కొంపతీసి?

వార్డ: మీరూ డి. యస్. ఓ. మాట్లాడుతుండగా వినొచ్చి కానిస్టేబుల్ చెప్పాడు.

చౌదరి: అయితే యీరాయి డి. యస్. ఓ. దాకా తగుల్తున్న దన్నమాట.

వార్డ: వీడెవడో కాలాంతకుడులాగా ఉన్నాడు; గట్టిపట్టు పట్టాడు.

చౌదరి: ఏం పర్వాలేదు. డి. యస్. ఓ. గారి బావగారు యం. యల్. ఏ. క్షణంలో కేసు కొట్టించేస్తాడు.

వార్డ: అయినా మనం చేసింది తప్పే.

చౌదరి: తప్పేమిటండి? తప్పు! ఈ కాలంలో ఎవడికి వాడు నాలుగు కాసులు చేసుకోవాలి.

వార్డ: గవర్నమెంటు ఇప్పుడు కాస్త తీవ్రంగా చర్య తీసు కుంటు న్నట్టుంది.

చౌదరి: తీవ్రమూ లేదు, చర్యాలేదు. బాపనయ్య దగ్గర రెండు మూడు వందల పుట్లధాన్యం మూలుగుతూంది. ఆయన గడపతొక్కి పడిధాన్యం తెచ్చే ధైర్యం ఒక్క ఆఫీస రుకూ లేదు.

1వ ఖై: అవున్నా ఆఫీసర్ల ధైర్యమంతా మనబోటాళ్ళమీదనే!

2వ ఖై: అంతేకదూ! మొనగాళ్లు గుడిసెలమీదపడి రోజుకు పెట్టుకున్న ధాన్యాన్ని కూడా లాక్కుపోతున్నారు.

1వ ఖై: మా వూళ్ళో రిలీఫ్ అంగడంటూ పెట్టారు. ఊరి మునసబు కిచ్చారు; 20 బస్తాలొస్తాయి; అందులో వారానికి అర్ధమపక్షం 10 బస్తాలు ఆయన ఎనకేస్తాడు.

2వ ఖై: ఎట్టా? లెక్క లేదూ?

1వ ఖై: ఎట్టాగేంటోయ్? చుట్టుపక్కలున్న గ్రామాల్లో అంతా కూలీనాలీ చేసుకొనే జనం అధికం. వాళ్ళ కొక్కొక్క వారం రేషను కొనుక్కునేందుకు డబ్బు లుండవు; అంతగా కూలినాలి చేసి డబ్బులు తెచ్చు కుంటే వారం అయిపోయిుందంటాడు; రేషన్ కార్డు లన్నీ దగ్గరే వున్నాయి, ఆళ్ళకేం సదువా సంధా? ఇచ్చినట్లు గీట్లు గీస్తుంటాడు. అడిగే నాయా లెవడు?

2వ ఖై: చెక్కింగు ఆఫీసర్లుంటారు గదంట్రా?

1వ ఖై: ఆఫీసర్లంటే ఆకాశాన్నుం డూడిపడ్డారనా? ఆళ్ళూ మనుషులే; ఆశ చూపితే అందరూ లొంగుతారు.

2వ ఖై: అయితే యిదెట్టా తెగే దంటావు?

1వ ఖై: మనకు సోసే దాకటే. అందరూ జైల్లో కొచ్చికూచుంటే సరి.

2వ ఖై: మరి బువ్వో?

1 ఖై: ఆఁ, గవర్నమెంటు పెట్టటంలా. అట్టాగే అందరికీ పెడ్తది.

[చౌదరి, వార్డన్ పెద్దగా నవ్వారు. ఖైదీలు జవాబుగా వెకిలిగా నవ్వుతారు. చౌదరి, వార్డన్ మొఖాలు చిన్న చేసుకుంటారు....]

చౌద: (ఉన్నట్టుండి ఏదో జ్ఞాపకం వొచ్చి) ఇక్కడ ఫోనుందా?

వార్డ: ఎందుకు?

చౌద : పనుంది.

వార్డ : ఇక్కడెక్కడో పబ్లిక్ ఫోనుండాలి.

చౌద : రైట్ ! అయిపోయింది. ఒక్క క్షణంలో తేల్చేస్తా వీడెంత ? వీడి సబ్ ఇన్‌స్పెక్టర్ పనెంత ? మహామహా వాళ్ళను చూశాను. (వెళ్తాడు)

[ వార్డన్ ఏమీ తోచక అటూ ఇటూ తిరుగుతూ వుంటాడు. ఇంతలో మొట్టమొదట ఆడిమనిష్నిలోకి పరుగెత్తిన దొంగ గబగబా పరుగెత్తుకుంటూ, రొప్పుకుంటూ వచ్చాడు. వచ్చి అటూ ఇటూ మాచి వార్డన్‌తో....................]

దొంగ: అయ్యా ! అయ్యా !

వార్డ : ఏం ?

దొం : ఇప్పుడే ఇక్కడ, ఈ బావిలో, ఓ ఆడమనిషి పడి చచ్చిపోయిందంట. మీరు చూచారా బాబూ ? నిజమేనా ?

వార్డ : అవును చచ్చిపోయిందంట. అదిచస్తే చచ్చింది, మా ప్రాణాలు తీస్తోంది. అది చావటానికి మేము కారణ మట ? ఎవరు దేనికి కారణం ! ఎవరికర్మ వాళ్ళదిగాని.

దొం : ఇంతకూ చచ్చిపోయిందా బాబూ ?

వార్డ : చచ్చిందట.

దొం : మీరు మనిషిని చూశారా ?

వార్డ : లేదు.

దొం : ఎట్టావుంది బాబూ మనిషి ?

వార్డ : అరె! చూడలేదంటే ఎట్లావుందని అడుగుతావేం? ఆడమనిషిలాగే వుంటుంది.

దొం : పిల్లలా బాబూ? పిల్లలన్నా బతికున్నారా బాబూ? మీరు చూశారా పిల్లల్ని?

వార్డ : పిల్లలూ, తల్లీ అంతా క్లోస్. చెప్పకుండా పోయాయి ప్రాణాలు.

దొం : ఎందరు పిల్లలు బాబు?

వార్డ : నిన్ను చూస్తే వదిలేటట్టులేవే. ఎందరు పిల్లలు? ఎవరికి పుట్టారు? ఇదంతా విచారించటమూ నా పని?

దొం : కాదు బాబూ! మా యింట్లోవాళ్ళం వారం రోజులుగా పచ్చి మంచినీళ్ళు తాగుతున్నాం. పిల్లా జల్లా అందరూ అట్లాగే బతికున్నాం. మేము సరే–ఆ పిల్లలు– ఆళ్ళేం చేశారు. ఆళ్ళట్టా ఎండిపోతావుంటే చూడలేక పోయా! చివరికి...

వార్డ : బావిలో తోశావా?

దొం : లేదు బాబూ, ఆపని చేయలేకనే బయల్దేరా దొంగతనానికి.

వార్డ : దొంగతనానికి! నువ్వు దొంగవా? ఎక్కడికి కెళ్ళావు దొంగతనానికి?

దొం : ఆడ చదువుకుంటారే – ఆ చోట్లో – ఆస్టలంట అది–

వార్డ : ఓ! నువ్వేనా ఆ మహానుభావుడివి. యస్. ఐ. గారూ...ఇన్‌స్పెక్టరుగారూ!... (చాలా ఆత్రంగ

వేసుతూ పిలుచాడు; బెల్ కొట్టాడు) దొంగ ... దొంగ...

దొం : జైల్లో ఎయ్యటాని కేనా బాబూ? మీ రెయ్యక్కర్లా? నేనే ఎళ్ళి కూసుంటా. నేనేం లచ్చలు- వేలు దొంగతనం చేయలా! పిడికెడు కూడు బాబూ! ఆకలితో చస్తున్నబిడ్డల కంత కూడు. అంతే బాబూ! ఎప్పుడూ దొంగతనం ఎరగను. మావోళ్ళంతా చాలా గొప్పగా మర్యాదగా బతికినోళ్ళు. మర్యాద, గౌరవం, గొప్ప - అన్నీ చచ్చాయ్. ఆకలిలో...దొంగిలించా...తీరా తీసుకుని ఇంటికిపోతే ఇల్లు కాళీ. ఇంతలో యీ చావు కబురు విన్నా. నా లచ్చేమోనని పరుగెత్తుకొచ్చా. చెప్పండిబాబూ - ఏమంది? చెప్పండి బాబూ!

వార్డ : లోపలుందట! పోలీసునడుగు చూపుతాడు.

దొం : ఆఁ ఆఁ, బాబా, బాబూ! (పరుగెత్తి వెళ్ళాడు)

వార్డ : ఏయ్! పోలీస్! దొంగ! దొంగ! జాగ్రత్తగా చూడు! వాడు పచ్చిదొంగ!

[ఇంతలో యస్. ఐ. వస్తాడు]

స. ఇ : వాడుకాడు దొంగ. మీరు, మనం, మనపైన వున్న వాళ్ళు.

వార్డ : నిజంగా దొంగ వచ్చాడండి!

స. ఇ : కాని అసలుదొంగ తేలలా!

వార్డ : యస్. ఐ. గారూ! నన్ను కాస్త తొందరగా పంపేయండి దయచేసి. ఇంజనీరింగు కాలేజీవాళ్ళ నాటకం తప్పక చూడాలి.

స. ఇ: ఈ జీవితనాటకం చూడండి సార్. చాలు...ఇదిగో కొత్తపాత్రలు వస్తున్నాయి చూడండి. ఈ పాత్రలను నాటకంలోలా నేను డ్రామటిక్‌గా ప్రవేశపెట్టి పరిచయం కలగజేయలేను. అయినా...యీాయనెవరో తెలుసునా? మన డి. యస్. ఓ. ఆయన వెనకాల వున్నవారు ఓ గ్రామమునసబు (ఇటూ అటూ చూచి) చౌదరిగారెక్కడ?

వార్డ: ఫోన్ చేయాలని వెళ్ళాడండి.

స. ఇ: ఎవరికో?

వార్డ: ఏమోనండీ!

స. ఇ: బహుశా గవర్నమెంటు హౌసుకై ఉంటుంది. వుండనీండి. (డి. ఎస్. ఓ. తో) రాండి సార్! రాండి కూర్చోండి.

[ డి. యస్. ఓ. తలవంచుకుని కూర్చున్నాడు. ]

స. ఇ: (సెల్లులోవున్న ఖైదీలను చూపి) వీళ్ళెవరో తెలుసాండి?

[ డి. ఎస్. ఓ. మౌనం ]

స. ఇ: వీళ్లు దొంగలు.

వార్డ: ఏమండీ! నాటకం ఈ పాటికి సగం అయిపోయి వుంటుందండీ.

స. ఇ: ఇదుగో తొందరలో పంపేస్తా. మిమ్మల్ని ఎక్కడికి పంపాలా అనేదే ఆలోచిస్తున్నా. ఆర్డర్లకోసం ఎదురు

చూస్తున్నా. డి. ఎస్. ఓ. గారూ! ఈరోజు ఒక ఆడది ముగ్గురు బిడ్డలతోసహా ఆత్మహత్య చేసుకుంది.

డి. ఎస్. ఓ. : అబద్ధం!

స. ఇ : ఇదిగో డాక్టర్ సర్టిఫికేటు!

డి. ఎస్. ఓ: ఇదేదో నాటకం!

స. ఇ : హుఁ, మీ కందరికీ నాటకంజబ్బు పట్టిందేం? ఇక్కడ కాదు. పచ్చయప్ప కాలేజీలో జరుగుతోంది. యిది యథార్థం. కావాలంటే శవాన్ని చూచిరండి.

డి. ఎస్. ఓ: నేను చూడాల్సిన అవసరంలేదు.

స. ఇ : అవును, 5 వేలు చూచిన కళ్ళతో శవాన్నేలా చూస్తారు పాపం!

డి. ఎస్. ఓ: మీకు రుజువు?

స. ఇ : రుజువులన్నీ వున్నాయి. అది కోర్టులో మాట్లాడాల్సిన మాటలు. కాని యిక్కడ మిమ్మల్ని నేను కోరే దొక్కటే. మీ గుండెలమీద చేయి వేసుకొని చూడండి, మీకు రోజు కెందరి ప్రాణాలు తీస్తున్నారో. మీ బిడ్డల్ని ఒక్కసారి బావిలో పారేస్తే...

డి. ఎస్ ఓ: యస్. ఐ. గారూ!

స. ఇ : మీ భార్య బావిలో పడితే...

వార్డ : మమ్మల్ని ఏడిపించాలనా ఇదంతా?

స. ఇ : ఏడిపించాలనికాదు. మీ కర్థంకావాలని; అంతే!

డి. ఎస్.ఓ:యస్.ఐ. గారూ! మీకు రుజులువుంటే కోర్టులో దాఖలా చేసుకోండి. మీ చేతనైనపని చేసుకోండి;

అంతేగాని ఒక గవర్నమెంటు ఆఫీసరును బాధ్యతా రహితంగా......

స. ఇ : మీరు బాధ్యత కలిగే ప్రవర్తిస్తున్నారా ?

డి. ఎస్. ఓ: మాకు తెలిసినంతవరకు నే మెవరి ప్రాణాలు తీయలేదు.

[ డి. ఎస్. ఓ. పై మాటలు చెప్తూ మెల్లగా జేబులోనుంచి నోట్ల కట్టతీసి వేస్టుపేపర్ బుట్టలో వేయబోతుంటాడు. ]

స. ఇ : స్టాప్ ! నోట్లకట్ట బుట్టలో పడ్డదా తల పేల్తుంది.

[ డి. ఎస్. ఓ. ఆగిపోయాడు ]

స. ఇ : హాండ్సప్.

[ డి. ఎస్. ఓ చేతులెత్తాడు. ఇంతలో చౌదరివచ్చి వెనక్కి తగ్గాడు ]

స. ఇ : రాండి ! చౌదరిగారూ ! (చౌదరి వెనకడుగువేశాడు) ఇంకొక్క అడుగు కదలకండి. ప్రమాదం (బెల్ కొట్టాడు; కానిస్టేబిల్ వచ్చాడు) చౌదరిగారి కోటు జేబులో ఓ ఉత్తరం ఉంది తీయరా ! (కానిస్టేబిల్ చౌదరి జేబులో వుత్తరంతీశాడు) వార్డన్ గారూ, ఉత్తరం చదవండి.

వార్డ : (ఉత్తరం తీసుకొని చదువుతాడు) చౌదరిగార్కి, రేపు ప్రొద్దున్నే 60 లక్షల బస్తాలు పంపాలన్న విషయం జ్ఞాపక ముందనుకుంటా. ఇంతవరకు మన విషయం సెటిల్ చేయలేదు. నాకు కాస్త పైకం జరూరుగా వుంది. రాత్రికి కలుస్తా. మీ

ప్రసాద్

స. ఇ: ప్రసాద్ మీరేనాండి?

డి. ఎస్. ఓ: అవును.

స. ఇ: ఈ ఉత్తరం మీరు వ్రాసిందే? అవునా?

[ డి. ఎస్. ఓ. మౌనం ]

స. ఇ: గిద్దలూరు బాపనయ్య దగ్గర 200 పుట్లు ధాన్యం వుందని మీకు తెలీదా?

డి. ఎస్. ఓ: తెలీదు.

స. ఇ: మీకు తెలిసినట్లు దాఖలా చూపుతాను.

డి. ఎస్. ఓ: తెలిస్తే?

స. ఇ: మీరెందుకు ప్రొక్యూర్ చేయలేదు?

డి. ఎస్. ఓ: ఆయ నివ్వలేదు.

స. ఇ: మళ్ళా అబద్ధం!

1వ ఖై: ఇవ్వనంటేనే వూరుకున్నారా? మా ఇళ్ళల్లో దూరి కుండా బొచ్చా అంతా గాలించి లాక్కెళ్ళలా. అట్టా యెందుకు చేయకూడదంట?

2వ ఖై: ఎందుకంటే, ఆళ్లు లావాంటాళ్లురా?

1వ ఖై: బాపనయ్య పెద్ద మంత్రులతో సెప్పి ఎడ ఉద్యోగం వూడ బెరికిస్తాడో అని భయంరా.

స. ఇ: (ఖైదీలకు) ష్నూ. (డి. ఎస్. ఓ. తో) బాపనయ్య బ్లాక్ మార్కెట్ వ్యాపారం చేయటం మీకు తెలీదూ?

డి. యస్. ఓ: తెలిస్తే?

స. ఇ: మీరు, బాపనయ్య, చౌదరి-మీరందరూ ఈ వ్యాపారంలో భాగస్వాములు; మీరందరూ షరీకై ఇది సాగిస్తున్నారు!

డి. ఎస్. ఓ: లేదు లేనే లేదు—

స. ఇ: అయ్యా! గ్రామమునసబుగారూ!

డి. ఎస్. ఓ: ఏమని బెదిరించాడు మిమ్మల్ని?

[ మునసబు చెప్పటానికి జంకుతాడు. ]

స. ఇ: చెప్పు! ఫర్వాలేదు.

మున: మావూళ్ళో 200 ఇళ్ళున్నాయండి. 200 ఇళ్ళలో ఏ పది ఇళ్ళల్లో మందికో సరిగా రెండు పూటలా భోజనం వుంటుంది. మిగతా అందరూ వారానికి మూడురోజులు తింటే అధికం. ఈ విషయం నే నెన్నోసార్లు అయ్యగారితో మనవి చేసుకున్నాను. పండిన పంట పండినట్టే లాక్కెళ్తున్నారు. పెద్దవాళ్ళ దగ్గర్నుంచి గింజైనా కదల్చడంలేదు. మహాభాగా పండినా రైతుకు మూడు నెల్లు బత్తెంరాదు. అది కాస్తా లాక్కెళ్తే వాళ్ళేం కావాలి? ఈ విషయం పైకి రాయమని ఎన్నోసార్లు చెప్పానండి.

డి. ఎస్. ఓ: నేను రాశాను.

మున: రాశారేమోగాని, పత్రికల్లో మాత్రం మా వూళ్ళో తిండికరువేమాత్రం లేనట్టే వచ్చిందండి!

డి. యస్. ఓ: పత్రికల్లో వచ్చిందానికి నేనా కారణం?

మున : కారణం ఎవరిక్కావాలి బాబూ? ఫలితం కావాలిగాని. ఇదిట్టా వుండగా మొన్న అయ్యగారు మా వూరొచ్చి మా వూళ్ళో ఆహార పరిస్థితి బాగుందని, తిండి లేకుండా మనుషులు చావటం నట్టి అబద్ధమని రాసివ్వమన్నారు.

స. ఇ : నువ్వేమన్నావు?

మున : రాసివ్వనన్నానండి.

స. ఇ : ఎందువల్ల?

మున : అదొట్టి అబద్ధం బాబు!

స. ఇ : తరువాత?

మున : అయ్యగారు నన్ను బెదిరించి బలవంతాన వ్రాయించుకు పోయారు బాబు!

డి. యస్. ఓ : అబద్ధం, పచ్చి అబద్ధం! యు స్కౌండ్రల్!

[విసురుగా వెళ్ళి కొట్టబోయాడు]

స. ఇ : (డి. ఎస్. వో. నాపి) ఆగు!

దొం : (పిచ్చివాడిలాగా వస్తూ) అబద్ధం! నా పెళ్ళాం చచ్చింది అబద్ధమా? నా పిల్లలను నూతిలో పడేసిం దబద్ధమా? నేను కడుపుమాడి చావలేక, తిండికోసం దొంగతనానికి పోయిం దబద్ధమా? ఏ దబద్ధం? మనం బతుకుతున్నా మన్నది అబద్ధం. మనకు స్వాతంత్ర్యం వచ్చినమాట అబద్ధం. ఇది పేదోళ్ళరాజ్యం అనటం అబద్ధం.

స. ఇ : ఏయ్, ఎవరు నువ్వు?

మేస్త్రి : వీడేనండి మా హొటల్లోపడ్డ దొంగ.

దొం : నువ్వు సెప్పకర్లా! నేనే చెప్తా; నేనే దొంగను. మీ రందరూ పెద్దమనుషులు! మీకు డబ్బుంది. అధికార ముంది. తిండివుంది; మీ దొంగతనాలు పెద్దతరహావి. (చంకలోవున్న అన్నంమూట తీసి చూపుతూ) ఇదిగో మీ అన్నం. దీనికోసమే నేను దొంగ నయ్యాను. దీంతో నా పెళ్ళాం బిడ్డల్ని ఒకరోజు బతికిద్దామను కున్నాను. పిచ్చివాణ్ణి, దీంతో ఒకరోజు గడిచినా మళ్లా పస్తులేకదా అన్న విషయం మరచిపోయాను. నా పెళ్ళాం తెలివైంది. దానికి తెలుసు యీ బాధ ఎప్ప టికీ తీరదని. బాగా ఆలోచించి చచ్చింది. నాకు దారి చూపింది. తీసుకోండి మీ అన్నం. (విసిరికొట్టాడు వాగ్దన్ మీద. వెంటనే యస్. ఐ. చేతిలోవున్న పిస్టల్ తీసి పేల్చుకున్నాడు.)

స. ఇ : ఆఁ ఆఁ!

దొం : (ఒరిగిపోతూ) ఇంకా నేను దొంగనేనా? సెప్పండి! మీ అన్నం మీ కిచ్చేశాను. ఇంక నా కన్నంవద్దు... ఇక నేను దొంగనా?...దొంగనేనా?....దొంగ.... నే...నే...(పడిపోయాడు)

స. ఇ : (ఒక క్షణం అలావుండి కన్నీళ్ళతో) నువ్వు కాదు తమ్ముడూ దొంగ......ఇదిగో వీళ్ళు....వీళ్ళందరూ దొంగలు.....కోడుదొంగలు.....తిండిదొంగలు. నీ ప్రాణాలూ, నీ పెళ్ళాం బిడ్డల ప్రాణాలూ తీసింది వీళ్లు. పదండి, కదలండి. (విసుగా డి. ఎస్. ఓ దగ్గరకు వెళ్ళి మెడ పట్టుకొని) మిమ్మల్ని ఉరితీసే అధికారం లేదు,

కాని—మీకు తిండి లేకుండా పోవడం అంటే ఏమిటో చూపిస్తా. (సెల్లు వైపు గెంటుతాడు. వార్డన్, చౌదరీల నుద్దేశించి) ఊఁ! కదలకండి.

[మెల్లగా వాళ్ళిద్దరూ సెల్లువైపు నడుస్తూంటారు. కానిస్టేబుల్ వచ్చాడు...]

కానిస్టేబుల్: సార్! (ఒక కవరు ఇచ్చాడు. యస్. ఐ. కవరు చించి చదివి, చౌదరి వైపు - అందరి వైపు చూచి)

స. ఇ: చౌదరిగారూ! మీరే గెలిచారు. నేనే ఓడిపోయాను. అవినీతిని అరికట్టాలనేది వట్టి ఉపన్యాసాలని ఇప్పుడు తెలుసుకున్నా. నన్ను ట్రాన్స్ఫర్ చేశారు. మీరు బ్రతికిపోయారు.

(చౌదరి, అందరూ వికటాట్టహాసం చేశారు.)

స. ఇ: (బియ్యపుబస్తా క్రిందకు తోసి) తీసుకెళ్ళండి, తినండి; చచ్చేదాకా తినండి. దీన్ని ఎవరు కష్టించి పండిస్తున్నారో వాళ్ళందరూ చస్తున్నారు. వాళ్ళ కిది నిరాకరించబడింది. వాళ్ళందరూ పోయిన తరువాత మీరు బ్రతికుంటారా? బ్రతకండి.

(డి. ఎస్. ఓ., చౌదరి, వార్డన్ వికటాట్టహాసం చేస్తూ పోతారు.)

స. ఇ: (మెల్లగా గ్రామమునసబు దగ్గర కెళ్ళి) మునసబుగారూ! నా చేతనైనది చేద్దామనుకున్నా. అవినీతిని అరికట్టాలనుకున్నా. కాని అంతా నా కెదురయింది. ఇక మీరూ—గ్రామాలలోని ప్రజలు పరిష్కరించుకోవాలి యీ తిండిసమస్యను. (ఒక పిడికెడు బియ్యం తీసు

కొని దొంగ శవందగ్గర కూర్చొని) ఇదిగో తమ్ముడూ! బ్రతికుండగా పిడికెడు బియ్యం యివ్వకపోయినా ఇప్పుడైనా ఇస్తున్నా. (నోట్లో పోస్తాడు) యీ పిడికెడు బియ్యంతో—యీ దొంగల్ని—తిండిదొంగల్ని మమ్మల్ని క్షమించు.

(తల పట్టుకుని విచారంగా వుంటాడు. ఇంతలో పత్రికా విలేఖరి వచ్చి రిపోర్టుతీసి పిచారంగా చింపేస్తూంటాడు.)

(తెర జాలిగా దిగుతుంది.)

## పాత్రలు



భారతమ్మ

శేషయ్య

వాలంటీరు

జగన్నాథం

— ఇంకా —

ఇద్దరు మాలవాళ్లు, ముగ్గురు హరిజన స్త్రీలు వస్తారు.



(అదొక పూరిగుడిసె. తెర తీసేసరికి ప్రేక్షకులకు ప్రముఖంగా కనిపించేది ఎదురుగా గోడకు తగిలించివున్న కస్తూరిబా ఫోటో, దాని క్రింద ఒక చిన్న స్టూలుమీద గాంధీ శిలాప్రతిమ, దానిదగ్గరే ఓ రాట్నం, ప్రేక్షకులకు కుడివైపున ఒక మూలగా వంటిల్లు ఏర్పాట్లు చాలా క్లుప్తంగా, ఎడమవైపు వీధిలోకి వెళ్ళే ద్వారం, ఒక చిరుచాప, పీట, ఆసు పలక, దండెం, యిలాంటి చిన్న సామాన్లు. ఇప్పుడింట్లో ఎవరూలేరు. ఇల్లంతా ప్రశాంతంగా వుంది. ఒక్కక్షణం తర్వాత వీధిలోంచి "భారతమ్మా, భారతమ్మా" అని ఒక మగ గొంతుక పిలుపు. బదులు లేనందువల్ల కాస్సేపాగి ఆ పిలిచినవ్యక్తి లోపలికి వచ్చాడు. బాగా ముదురు మనిషి; బక్కగా వున్నాడు. ముతక బట్టలు, పంచె కట్టు, పైన కండువా, పొట్టిగా కత్తిరించిన తల, పొలంమీది నుంచి అప్పుడే వస్తున్నట్లున్నాడు. లోపలికొచ్చి ఇల్లంతా ఒక్కసారి కలియ చూశాడు. తనకు కావాల్సిన వ్యక్తి కనబడనందున మళ్ళా ఒకసారి గట్టిగా పిలుస్తూ, దొడ్లో ఉన్నదేమోనని వెళ్తున్నాడు........ ఇంతలో "ఎవరూ" అనుకొంటూ ఒక ముసలావిడ లోపలికి వచ్చింది. ఆయన ఆగాడు. ఆమె పండుముసలి. కానీ పళ్ళూ, వళ్ళూ గట్టిగానే వున్నాయి. ముతక ఖద్దరు కావిరంగుచీర కట్టుకుంది. తలలో నెరసిన భాగం ఎక్కువ. ఎడమ చేతిలో పుల్లలమోపు, కుడి చేతిలో కర్ర, పుల్లలమోపుమీద తోటకూర కట్టలు వున్నాయి. జీవితంలో బాగా నలిగిన మనిషి అని ముఖం చెబుతుంది. కళ్ళుమాత్రం అతి తీక్షణంగా వున్నవి. నడకలో ఒక విధమైన హుందాతనం వుంది.

భారతమ్మ: ఎవరు? శేషయ్యా!

శేషయ్య: ఆఁ. నేనేనమ్మా! ఏంది భారతమ్మా నువ్వు! ఈ పుల్లలు, పుడకలు ఏంది? ఈ తోటకూర ఏంది? ఈ రోజున నువ్విట్టా వున్నావేందమ్మా! అన్యాయం మరీని.

భార : ఏం నాయనా! ఏం వచ్చిం దీరోజు ?

శేష : ఏంవచ్చింది! మెల్లగా అడుగుతావే ఇంకా ? ఊళ్లోకి పోయావే, చూళ్లేదూ ఎట్టాగుందో ?

భార : చూచాన్నాయనా! దారి పొడుగునా పోలీసులు నిలబడి వున్నారు. ఎందుకో ఏమో!

శేష : ఎందుకా? ఏమీ ఎరగన ట్టడుగుతుండావే!

భార : ఎరక్క-కాదులే! దొంగలొచ్చినా, దొరలొచ్చినా పోలీసు కాపలా పెడతారు. ఇప్పుడు వచ్చేది ఎవరా అని? (చాపకోసం వెళ్ళింది.)

శేష : పోవమ్మా! నీ మాటలూ నువ్వూనూ! చిన్నబ్బాయి గారు పది గంటలకంతా వస్తారంటను. ఆయన మంత్రి అయినాక ఇదే కదమ్మా మొదటిసారి మనూరికిరావటం. అయితే భారతమ్మా, నీకు ముందుగా జాబురాయలేదంటావా!

భార : రాయకపోయినా తెలిసిందిలే!

శేష : తెలిసేనా ఇంకా ఇట్టాగున్నావు! రాయలేదని ఆయన మీద సాదింపటమ్మా! ఆయనకెన్ని పనులో ఏమో! కానీవమ్మా కానీ, కట్టవమ్మా తోరణాలు. మన సేద్ది గాణ్ణి పంపిస్తాగాని వాకిట్లో పందిరేయించు. చిన్నబ్బాయిగారు వస్తున్నారని ఊరంతా ఒకటే కోలాహలంగావుంటే-ఎన్ని పార్టీలు, ఎన్ని డిన్నర్లు-అదిపోతే పోయిందిగానీ ఇంటి నుంచి కాయగూరలు పంపిస్తా కాస్త కమ్మగా వండిపెట్టవమ్మా! ఎవరెన్ని పెట్టినా

కన్నతల్లి నువ్వు పెట్టికట్టుకుంటుందా? (ఇటు అటు చూచి) అరే మంచం లేదూ? ఇన్నాళ్ళా నేలమీదే పడుకుంటున్నావటమ్మా నువ్వు? బతేదాసివే! ఒకమాట చెప్పొంటే మానింటికాడ వూరక్క పడుండాయే .. నవారుమంచం పంపించుడనటమ్మా?

భార : (ఇదివరకే ఒకటి రెండుసార్లు తనసరిని చూచుకొంటూ అక్కర్లేదు) చిరునవ్వుతో చూచింది) శేషయ్యా! (కొంచెం కఠినంగా అన్నది) అదంతా ఏమీ అక్కర్లేదు కానీ నువ్వొచ్చినపని చూచుకో!

శేష : అదేంది భారతమ్మా! నేనింకా దేనికొచ్చానని?

భార : నువ్వొచ్చింది ఇందుకే అయితే వెళ్ళొచ్చు.

శేష : (దెబ్బతిన్నాడు. తమాయించుకొని) భారతమ్మా! కోప్పడితే కోప్పడ్డావుగానీ ఇదంతా సూస్తుంటే నాకు మహా పరితాపంగా వుంది. మునెప్పుడ్నుంచి యీ మొండి తనమేగదా నీది. చిన్నబ్బాయిగారి తప్పేమో ననుకున్నానుగానీ తరవాత తెలిసింది, ఆయన ఇహా లేనట్లు అనుకున్నాడంటగా, ఢిల్లీక వచ్చి హాయిగా వుండవమ్మా అని. ఆ మాట నిజమేనా?

భార : నిజమో, అబద్ధమో అవన్నీ ఇప్పుడెందుకులే!

శేష : అదికాదు భారతమ్మా, ఏంది చెప్పు నీకే ఖర్మ? నీకేం తక్కువ? ఎంతకాలమని యిట్టా యీ పూరికొంపలో పుట్ట - పురుగ పరిగెత్తుకుని పొయ్యిపోసుకుంటావు? కొండంత కొడుకు అదృష్టంకొద్దీ పెద్ద పదవిలోకి వచ్చాడు. హాయిగా ఢిల్లీలో బంగళాలో కాలుమీద

కాలేసుకుని గడిపేయక- ఏందమ్మా ఈ అగచాట్లు! పదవమ్మాపద. నామాటవిను. ఇప్పటికి పడ్డకష్టాలు చాలుగాని ఈ వయసులోనయినా కాస్త సుఖపడవమ్మా!

భార : శేషయ్యా, అయిపోయిందా?

శేష : అంతేలే, అబ్బాయిగారి మాటే విన లేదంటే నా మాట వింటావా నువ్వు? నువ్వు ఓక్లికిపో - యీండనే వుండు. ఏమన్నా జేసుకోగాని యీ రోజుమాత్రం నామాట కాస్త యినవమ్మా. ఇల్లూ వాకిలీ అలికి - ముగ్గులు పెట్టించి, తోరణాలు కట్టించి పచ్చగా వుంచవమ్మా ఇంటిని. ఇందరంవుండి నిన్ను యిట్టా పాడు కొంపలో వుండ నిస్తున్నామంటే ఆయన ఏమనుకుంటాడు?

భార : అదా శేషయ్యా నీ బాధ?

శేష : ఆఁ నాబాధ నీకేం తెలుస్తుందిలే; తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది ఒక్కొక్కసారి. ఎంత సంసారం? ఎంత కమామిషు? దివాణంలాంటి ఇల్లు. దేశం దేశం అని దివాళా తీసిందమ్మా! కాంగ్రెసులోనే కరిగిపోయిందే! పెద్దబ్బాయిగారు తుపాకిగుండు తగిలి ఒరిగిపోవటం, అయ్యగారు జైలులో వుండగానే క్షయవచ్చి పోవటం, అమ్మాయిగారికి పెళ్ళిఅయిన ఐదోరోజుకంతా అయిదోతనం తీరటం, తినేవాళ్ళు తింటూవుంటే, దోచుకునేవాళ్ళు దోచుకుంటూ వుంటే, ధర్మసత్రంలాంటి ఇల్లు హారతి కర్పూరంలాగా హరించుకు పోవటం అంతా కళ్ళకు కట్టినట్టు కనిపిస్తావుందమ్మా. ఇన్ని

కష్టాలకు ఫలితంగా చిన్నబ్బాయిగారు యీ నాటికి మంచి పదవికి వచ్చారు. దేశంఅంతా ఆయన్ను చూచి ఓయబ్బో అంటూవుంటే నువ్విట్టా మండిపోతా వేం దమ్మా నీ చాదస్తంగాని.

భార : ఇంతకీ నీవు చెప్పేదేమిటి శేషయ్యా ?

శేష : చెప్పే దేముందమ్మా ! ఈ దినమన్నా అబ్బాయిగారిని ఇంటికి పిలిపించి నీ చేత్తో యింత అన్నం పెట్టవమ్మా! ఎంతకాలం సాధిస్తావు నీ వైరం. అయినా ఆయన మీదనా నీకు వైరం. ఆయనేం చేశాడని? కమ్యూనిష్టులతో ఏమయినా కలిశాడా? సోషలిస్టుల్లో చేరాడా? కాంగ్రెస్ కేమైనా ఎతిరేకం అయ్యాడా? ఏ కాంగ్రెస్ కోసమైతే మీ రింటిల్లిపాది నాశనమయ్యారో ఆ కాంగ్రెస్‌లో నేఉండి దేశంకోసం పాటుబడుతున్నాడు కదా? ఇంకెందుకు చెప్పు నీకీ బాధ? అట్టాంటి ఆయన్ను కన్నందుకు యింకా గర్వించాల్సింది పోయి ఎందుకమ్మా కారాలు–మిరియాలు నూరుతావు? ఆయన లేక పోతే ఈ రోజున కాంగ్రెస్ ఏమయ్యేదని! కులం–గోత్రం లేనోళ్ళంతా ఆ కిర్స్తానులలో జేరి గుద్దులాడుకుని కుక్కలు చింపిన యిస్తరి చేసుకోవచ్చని ఆ ప్రుంజది కాస్త ఊడగొట్టుకుంటే యీయన గాదటమ్మా ఆళ్ళనీ యీళ్ళని అంతా పోగేసి అందరినీ ఒక త్రాటిమీద నిలబెట్టుకొచ్చింది? ఈ నాడు మరల ఏడొందలమైళ్ళ దూరంనుంచి యీడకు వస్తున్నాడంటే ఊరక నేనా ? మరల యీ ఓట్లన్నీ ఎట్టాగొట్టా పోగేసి కాంగ్రెసును

నిలబెట్టాలనికదూ? అసలాయనే లేకుంటే యీాళ్ళ
జేసిన పనులకు ఎవడు ఓటేస్తాడు? యింటుండావా?

భార : (వచ్చే కోపమంతా అణచుకుని) శేషయ్యా ఎందుకు
నన్ను రెచ్చగొడతావు! నీతో వాదించటానికి నేను
సిద్ధంగా లేను, నీవు వెళ్లు.

శేష : అయితే రాకరాక అబ్బాయి వస్తావుంటే ఆయన
ముఖమయినా చూడకుండా వుండిపోతా? యింతటితో
ఆయన్ని వదులుకుంటావటమ్మా?

భార : ఎందరినో ఎన్నిటినో, వదులుకున్నాను. అవసరమయితే
వాడిని కూడా వదులుకుంటా.

శేష : సరే నీయిష్టం. అట్టాఅయితే యింక నేను చెప్పేదేముంది.
వస్తా. (పోబోతున్నాడు)

భార : శేషయ్యా!

[శేషయ్య ఆగాడు.]

భార : నువ్వొచ్చింది యీ పనిమీదేనా?

శేష : ఏందమ్మా అట్టా అడుగుతావ్.

భార : ఏం లేదు. ఇంత చిన్న విషయంకోసం నీ యంత పెద్ద
మనిషి యిక్కడకు రావటం అంటే...?

శేష : సరేలే! నీ చెప్పాళ్ళకేగాని, యింత చిన్నదే యిట్టా
తేల్చారేనే? ఇంక పెద్ద విషయాలు చెపితేమాత్రం ఏం
లాభం?

భార : ఉహూ! పోనీ చెప్పరాదా—అదేదో.

శేష : ఆఁ, ఎందుకులే. అసలే నీ మనసు బాగున్నట్టు లేదు. ఇందులో అమ్మా - కొడుకు ఏదో అన్యోన్యంగా ఉన్నప్పుడు చెప్పొచ్చుగాని...

భార : ఫరవాలేదులే చెప్పు శేషయ్యా.

శేష : ఎందుకూ, నువ్వేమో మంచికయినా చెడ్డకయినా ఆయనముఖమే చూడనని భీష్మించుకుని కూర్చుంటివే?

భార : మంచికయితే ఎప్పుడూ స్వాగతమే శేషయ్యా.

శేష : ఆఁ! మంచిగాక నీతో యింకేమి చెప్తానమ్మా! నీ సమాచారం తెలవదూ? నువ్వేమయినా అట్టా ఇట్టా మనిషివా అక్షదాసులు గ్రిప్పటానికి.

భార : ఇంతకూ ఏమిటో చెప్పరాదూ?

శేష : చెప్పమంటా?

[ భారతమ్మ ఒక చిన్న నవ్వు నవ్వుతుంది. ]

శేష : ఏం లేదు భారతమ్మా. మన చెరువులో తట్టుభూమి వుంది చూశావా?

భార : ఆ. ఇరవై ముప్పై ఎకరాలు వుంటుందికదూ?

శేష : ఆఁ! అంతేపదిలే. ఉచ్చి కొలిస్తే మహాగా వుంటే పది ఎకరాలు వుంటదేమోలే.

భార : ఊఁ.

శేష : దానికి నేను అక్షి పెట్టుకున్నానమ్మా. కర్నూలుదాకా పోయి ఏదో తంటాలుపడి సరేననిపించుకొచ్చా. ఈ ఎదవలు మాలోళ్ళున్నారే. వీళ్ళు పెట్టారు దానికి పెటకం. ఇప్పుడవ్యారం కొంచెం ఎదురుతిరిగింది. ఐనా

యీ ఎదవలు ఏంజేసుకుంటారు చెప్పు ఆ భూమి తీసుకుని? తినటానికి తిండే కరువయితే సాగుబడి చేసుకోవాలంటే యిత్తనాలకు మొదలుకొని అన్నిటికీ మన దగ్గరకే రావాలనే! ఎందుకు జెప్పు యీళ్ళకు? అందుకనే నేను ఏమంటానంటే భూమి మనపేర పట్టా గాని, అమీన సాగుబడికి పట్టా వాళ్ళనుగాదని మనం ఇక ఎక్కడికీ పోయేది లేదుగదా? చేసుకుంటారు; బతికిపోతారు. ఏమంటా?

భార : నువ్వు అనేది అంతాఅను; తరువాత చూద్దాం.

శేష : అదిగాదు భారతమ్మా; అసలు తగాదా ఎక్కడంటే యీ కమ్యూనిష్టులున్నారు చూశా! యీళ్ళకి యింకెక్కడా గుక్కతిరక్క యీ మాలాళ్ళతో కలిశారు. ఇక దొలిచింది పురుగు వాళ్ళతలల్లో. ఇప్పుడు వాళ్ళు కూసే కూతేందో తెలుసా? ఏబయి ఎకరాల కంటే ఎక్కువ ఎవరికీ వుండగూడదట! ఇన్నాన్యాయం? పెద్దోళ్ళు ఎప్పుడో సంపాయించినదంతా వదులుకుని నెత్తిన గుడ్డవేసుకుని పోవాలట– అదీ దరువు. రాసిన పేరు చదవనురాని ఎదవలకు పట్టాలలో పేర్లు రాసుకోవటం ఎందుకు? యింటుండా? కనక నీవుజేయాల్సింది ఏమీలేదు. అబ్బాయిగారితో యిదంతా కమ్యూనిస్టుల ఆట అనీ, కాంగ్రెసును పడగొట్టటానికి ఎత్తుఅనీ, ఒక్కమాట చెపితేచాలు. చమడాలు ఒలిచేస్తాడు. ఇంకో రహస్యం చెప్పమంటా! నే నీ మధ్య వాళ్ళను కదిలించి చూశా! క్రిందటి ఎలక్షన్లో వున్న

ట్టున్నారనుకున్నావేమో! పూర్తిగా మారిపోయారు. ఆళ్ళ లైనంతా చూస్తావుంటే ఆ గూడెంనుంచి ఒక్క ఓటు మన కాంగ్రెస్‌కి వచ్చేటట్టుగా లేదు. ఆఁ, అట్టాంటప్పుడు అసలు ఎందుకు యివ్వాలి వాళ్ళకు పట్టాలు; దూలబట్టా! అదీ నా పాయింటు.

భార : (ఇంతసేపు ఓపిక పట్టింది. ఇంక భరించలేక) శేషయ్యా! నడు బయటికి! ఈ కుళ్ళు నా యింట్లోకి తీసుకురాకు. ఈ కుట్రలు, కుయుక్తులు, రాజకీయాలతో నాయిల్లు పాడు చెయ్యకు, వెళ్ళు.

శేష : (షాక్ తిని) భారతమ్మా!

భార : వెళ్తావా, లేదా?

శేష : (వెళ్ళిపోతూ) నేను జెప్పలా నీ మనసు మనసులో లేదని. మళ్ళా వస్తాలే (వెళ్ళాడు)

భార : (అలాగే కాసేపు చూసింది. తిరిగి గాంధి విగ్రహం దగ్గరకువెళ్ళి మోకరిల్లింది) బాబూ ఏమిటి యీ రాజకీయాలు; నాబిడ్డ మంత్రి కావటంవల్ల వచ్చిన మహా పాపమా యిదంతా? ఏమయిపోయింది తండ్రీ యీ దేశం? (బైట అమ్మగారూ, అమ్మగారూ అని కొన్ని కంఠాలు.) ఎవరూ!

బయట: మేమేనమ్మా! మాలోళ్ళం!

భార : (లేచి గబగబా వాకిలిదాకా వెళ్ళి) ఏమిట్రా! ఏమిలా వచ్చారు? రండి, లోపలికిరండి.

బయట: ఒద్దులే అమ్మా; యీడనే వుంటాం.

భార : ఛీ, వెధవల్లారా, రండిలోపలికి (అంటూ తను లోపలికి వచ్చింది. వెనకాల వాళ్ళూ వచ్చారు.) ఏరా గంగులూ ! ఇందరిని వెంటబెట్టుకొచ్చావు ?

వాళ్ళు : అమ్మా మీారే రచ్చించాలి. మా సిల్లా, మేకా కాపాడాలి (అంటూ అందరూ ఒక్కసారిగా ఆమె కాళ్ళమీాద పడ్డారు)

భార : (కంగారుగా) ఏమిరా ! ఏమిరా యిదంతా ? ఏ మొచ్చిందిరా యిప్పుడు ? చెప్పండి.

వాళ్ళు: ఏముందమ్మా; దిక్కులేని అనాథులమై పోయాం. ఇంకీ వూరొదిలి ఏడకన్నా పోవాల్సిందే, యీాడ బతకలేం తల్లీ.

భార : ఏమైంది ! తాపీగా చెప్పండిరా.

ఒకడు: సెప్పరా సిన్నోడా !

చిన్నో: ఏంలేదమ్మా, సెనువుకు ఎగువన పాతికెకరాల బీడు పడుంటే అందరం కలసి నానాతిప్పలూపడి దాన్నొక దారికి తెచ్చుకున్నాం ; ఫరవాలేదులే పైరు పెట్టుకుంటే బతికిపోతాం అని అనుకొంటూ వుండగానే అది కాస్తా ఎగరదన్నుకు పోయాడు.

భార : ఎవరు ?

చిన్నో: అంతా మనోళ్ళేనమ్మా. ఆ శంకరయ్యేమో ఎప్పుడో జైలుకు పోయాడనీ, ఈ శివకామయ్యేమో సిన్నప్పు డెప్పుడో సత్యాగ్రహాల్లో ముప్పైఅరూపాయలు జరిమానా కట్టినాడనీ, అట్టా యిట్టా జెప్పి, ఆళ్ళకు

యీళ్ళకు పంచిపెట్టేశిరి. అది పోతేపోయే. ఆ పెంట దిబ్బ లవతల పాక లేసుకు పడుంటే ఆ ముండమోపి నేలంతా తనదేనని ముత్యాలయ్య అర్జీ పెడితేనో దానికీ తలాడించిరి. మొన్న పొద్దునే ఆయనొచ్చి లేస్తారా, చస్తారా అని అగమాయించి అందరినీ చెట్ల కిందజేర్చా డామారాజు. ఇం కెట్లాగమ్మా యీ వ్వాళ్ళో బ్రతికేది ?

ఒకడు: ఒరే! యింకొకటి మరసినావు గదంటరా ?

చిన్నో: ఊc, చెప్పింది చాల్లే.

ఇంకో : పోరా. (ముందుకు తోసుకొచ్చి) ఇది కొంచెం యినండమ్మా; యింతకన్నా అన్యాయం ఏమన్నా వుందేమో. తాతలకాలంనుంచి పండినా పండకున్నా, పస్తులుండయినా శిస్తులుకట్టుకుంటూ ఆకౌలుభూముల్ని నమ్ముకుని పడివున్నాం. ఇప్పుడేదో కాలవలొస్తాయని, బంగారం ముద్దలు పండుతాయనీ ఆశపడి, అడలగొట్టి ఆ కౌస్తా లాక్కుపోయిరి. పాతవి అట్టాపోతే కొత్తవి యిట్టా కొట్టుకుపోతే, కౌలువులేక కొంపలేక ఎట్టా బతకాల చెప్పండమ్మా. ఈ అన్యాయానికి అద్దూ పద్దూ వుంటదా? మమ్మన్నేమయినా బతకమంటారా, కట్టకట్టుకొని చావమంటారా ?

భార : ఇదంతా నాతో చెప్తే నేనేం చెయ్యగలనురా మీకు? నామాట ఎవరు వింటారురా ?

చిన్నో : ఏమోనమ్మా, యింతూరులో యినిపించుకునే మా రాజే కనుమైపోయారు. మీరు కాదంటే మేమేం

చెయ్యం ? మీ కాలంలో మమ్మల్ని కడుపులో దాచుకుని కాపాడారు. ఇప్పుడు చిన్నయ్యగోరు పెద్దమంత్రి అయిపోయారంట; ఆయనకు తెలిసే యియన్నీ జరుగుతున్నయ్యంట. కటకటలాడే కరువు రోజుల్లో మాకు కూడుపెట్టి కాపాడారు. మీ కడుపున పుట్టినబిడ్డ యిట్టా చేస్తున్నాడంటే ఎట్టా నమ్మమంటారు ? నమ్మలేకనే ఆమడదూరం స్టేషన్‌దాకాపోయి అర్జీ యిచ్చుకుందామంటే ఆయనదగ్గరకు జేరనీయకుండా దరిమికొట్టిరి. ఈడకొచ్చినపుడన్నా చూత్తాడనుకుని ఆ కాయితం తపాల్లో ఏసివచ్చాం. ఇయ్యాల యీడకొత్తన్నాడంట. పోగ్రాములు చూస్తే మునసబయ్య నడిగితే "పోండిరా. ఆయనకు ఏడది తీరిక" అంటాడిప్పుడు. ఎట్టా సచ్చేది ? మీరన్నా సెప్తారేమోనని మీకాడకొచ్చాం. మీ బిడ్డకు మీరు సెప్పకపోతే మరెవరు సెప్తారమ్మా ? మీరు కాదంటే మేమందరం మీకళ్ళెదటే యీడనే పడి చస్తాం, చెప్పండి ఆ మాటన్నా.

భార : గంగులూ! (అలాగే నిశ్శబ్దంగా ఉంది; 'కటకటలాడే కరువు రోజుల్లో మాకు కూడుబెట్టి కాపాడారు మీరు.' 'మీ కడుపునపుట్టిన బిడ్డ మమ్మల్ని యిట్టా జేస్తున్నారంటే ఎట్టా నమ్మమంటారు. మీ బిడ్డకు మీరు చెప్పకపోతే ఎవరు సెప్తారమ్మా!' ఈ మాటలు ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయ్. కళ్ళనీళ్ళు బొటబొటా రాలినయ్) గంగులూ, మీ రందరూ వెళ్ళండి. నేను చెప్తా.

[ భారతమ్మ కళ్ళవెంట నీళ్లు కారటం
గమనించారు. ఆమె బాధ గుర్తించారు]

వాళ్ళు : వస్తామమ్మ ! (అందరూ వెళ్ళబోతున్నారు)

భార : గంగులూ !

గంగు : అమ్మా !

భార : శేషయ్య మీ దగ్గరకు వచ్చాడా యీ మధ్యన.

గంగు: వచ్చాడమ్మా.

భార : ఏం మాట్లాడాడు ?

గంగు: మాట్లాడే దేముందమ్మా. మరల ఓట్లకోసం కాకుంటే మాకాడికొచ్చేవాడా ? మా తరఫున ఆయనే మాట యిచ్చాడంట కాంగ్రెస్‌కి ఓటిస్తానని. ఆ మాట సెప్పి, ఆగ్దరేసి పోదామనుకున్నాడు.

[ భారతమ్మ అలానే స్థాణువుగా కూలబడి వుంది. జయ జయ ధ్వనాలు, మేళాలు, బ్యాండు కోలాహలంగా దూరంగా విని పిస్తున్నాయి. క్రమంగా దగ్గరకొస్తున్నట్లు బిగ్గరగా వినిపిస్తున్నాయి]

భార : మీరేమన్నారు ?

చిన్నో : అనేదేముంది. నిగుడు వేసిందానికి నెత్తిమీద సెయ్యి ట్టేరి. ఇక యీ యేడే యెయ్యాల ! దేనికీ మేమింతోరకు ఏమీ అనుకోలా, అందరం కలసి ఆలోచించుకొని చెప్తామన్నాం.

భార : అంతేలేరా ! ఆలోచించాల్సిన అవసరం ఏర్పడింది. ఆలోచించే చేయండి.

గంగు: వస్తామ్మా ! (అందరూ వెళ్ళారు.)

[ "జై జగన్నాథంగారికి జై, గాంధీ మహాత్మకూ జై, జవ్హార్ లాల్ నెహ్రూకు జై" అని నినాదాలు. భరింపరానంత బిగ్గరగా దగ్గరగా యీ శబ్దాలు హెచ్చినయ్. భారతమ్మ గబగబా వాకిలి దగ్గరకు వెళ్ళి బైటకు చూసింది. ఇక చూడలేకపోయింది. దబాలున తలుపు మూసింది. వెనక్కు తిరిగి గాంధీ విగ్రహం దగ్గరకొచ్చింది. "బాపూ" అంటూ చతికిలబడి ముఖాన్ని చేతులతో కప్పుకుంది. ఒకటి రెండు నిమిషాలు అలాగేవుంది. బయట తలుపుతట్టిన చప్పుడు. మెల్లిగా లేచి ........]

భార : ఎవరూ ? (వెళ్ళి తలుపు తెరిచింది) ఎవరు నాయనా ?

అతను: జగన్నాథంగారు పంపారమ్మా.

భార : (వెంటనే ఏమీ మాట్లాడక ఆవేశాన్ని చంపుకుని) ఏం ?

అతను: మిమ్మల్నొకసారి పిలుచుకు రమ్మన్నారమ్మా.

భార : నన్నా ! ఎక్కడున్నాడు ?

అతను: జోగయ్యగారి నగరిలో.

భార : నగరిలో ! నగరిలో వున్నాడా ? అంతకన్నా నరకంలో వుండలేకపోయాడూ! వెళ్లు. రానని చెప్పు. వెళ్లు. (కాలు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతూ మాట్లాడుతూంది) నా బిడ్డా వాడు! నా కడుపున పుట్టినవాడేనా ? అందరితోపాటు వాడూ పోయివుంటే ఎంత బాగుండేది ! నాకీ దుఃఖం వుండేదా? (గబగబా వాకిలిదాకా వెళ్ళి) నగరులో వున్నాడా ! సిగ్గులేదట్రా వాడికి. బ్లాక్ మార్కెట్‌లో వ్యాపారంచేసి, జనాన్ని పీక్కుతింటుండే ఆ జోగయ్య ఇంట్లో ఎలా అడుగు పెట్టాడురా వాడు.

మంచినీళ్ళయినా ముట్టుకోకూడదని మహా పాపిష్టికొంప కదరా అది. వెళ్ళు, రానని చెప్పు. వెళ్ళు. (లోపలికి వచ్చింది. కాస్త ఒక్కక్షణం తటపటాయించి, మళ్లా వాకిలివైపు పరుగెత్తుతూ) ఇదిగో అబ్బాయ్! యిలా రా, వాడితో చెప్పు. నేను చెప్పానని చెప్పు. వాడికి కన్నతల్లి వుందని ఏమాత్రమన్నా జ్ఞాపకంవుంటే వాణ్ణి యిక్కడికి రమ్మను. అదీ నా కోసం కాదు. వాడి కోసమూ కాదు. ఎందుకయినాసరే ఒకసారి వచ్చి పొమ్మను, అంతే. (ఉద్రేకంతో బాగా అలసిపోయింది, తలుపువేసింది. మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి చరఖా దగ్గర కూలబడింది. ఆవేశం బాగా చల్లారింది. తమాయించుకొని రాట్నం తిప్పుతూంది. బయట లౌడ్ స్పీకర్‌లో మొదట జయజయ ధ్వానాలు, తరువాత కరతాళ ధ్వనులు. లౌడుస్పీకరులో ఒక కంఠం)

ఒక కంఠం : సోదర సోదరీమణులారా! ఈనాడు మనకు పర్వదినం. ఎందుచేతనంటే మనవూళ్లో పుట్టి, మనవూళ్లో పెరిగి, మనమధ్య తిరుగుతూండిన శ్రీ జగన్నాథంగారు యీనాడు ప్రభుత్వంలో ఉన్నతపదవిలో వున్నారంటే మనమెంతో సంతోషించవలసిన విషయం. ఈయొక్క జగన్నాథంగారు వున్నారే, వీరు ఇన్నేళ్ళ తరువాత మనవూరికి, కాదు వారివూరికి వస్తున్నారంటే యీ రోజు పర్వదినం కాదా? చెప్పండి. ఈయొక్క జగన్నాథంగారిని గురించి మీకు నేను ఎక్కువగా చెప్పటంవుందే అది అనవసరం. వీరి కుటుంబం స్వాతంత్ర్య

పోరాటంయొక్క దీనిలో సర్వస్వం ధారపోసింది. ఈ యొక్క సంఘటన నాకు బాగా జ్ఞాపకముంది. ఒక నాడు నేను కళ్ళారా చూశాను. వీరింటియొక్క బట్టలకొట్టులోవున్న ఎలుకలు సీమగుడ్డ లన్నింటినీ చెత్తా చెదారముగా కొట్టివేసి, ఖద్దరుబట్టలయొక్క జోలికే పోలేదు. పూర్వం కుందేలుయొక్క ధైర్యాన్ని చూచి, ఆ స్థలంయొక్క మహిమను గుర్తించారట విద్యారణ్య స్వాములవారు. అట్లాగే యీ యొక్క ఎలుకలయొక్క దేశభక్తిని చూచి, మనం వీరికుటుంబం యొక్క గొప్పతనాన్ని తెలుసుకోవచ్చు. అంతటి దేశభక్తి పూరితమైన కుటుంబములో జన్మించిన యీ యొక్క జగన్నాథంగారు నేడు ఎన్నికల ప్రచారంకోసం ఆంధ్రదేశ పర్యటన ప్రారంభించారు. వారు కమ్యూనిస్టు ప్రమాదాన్ని గురించి, మన కర్తవ్యాన్ని గురించి ఉపన్యసిస్తారు. మీ రందరూ నిశ్శబ్దంగావుండి చివరిదాకా యీయొక్క ఉపన్యాసం వినాలని మాయొక్క కోరిక. (కరతాళాలు, అది సమసిన తరువాత ఒక పాడిదగ్గు, తరువాత జగన్నాథంగారి కంఠం.)

జగ: సోదరీ సోదరులారా! ఈ నియోజకవర్గానికి శ్రీ శ్రీ రాజా మహేంద్ర వీరవెంకట భూపాల్ రావుబహద్దూరు గారిని కాంగ్రెసుతరఫున నిలబెట్టాం. వారికే మీవోటు యివ్వాలని ఖచ్చితంగా చెప్పటానికే యింతదూరం వచ్చాను. కొందరు ద్రోహులు ఆయన జమీందారని, జస్టిస్‌పార్టీ మనిషని, పోయిన ఎలక్షన్సులో కాంగ్రె

నుకో పోటీచేశాడని ప్రచారం చేస్తున్నారు. అవన్నీ నిజమే. అయినా అవి మీరు మరచిపోవాలి. ఈనాడు కమ్యూనిస్టులను ఎదుర్కోవాలంటే, ఎన్నికలలో గెలవాలంటే అంతంతమాత్రపు వాళ్ళైతే తట్టుకోలేరు. ఆ మాత్రంస్తోమతగలమనిషి కావాలనే నిలబెట్టాం. ఇంకో రహస్యంచెప్పాలి. ప్రఖ్యాత గాంధీజ్యోతిష్కుడికి వీరి జాతకంచూపించాం, వీరు ప్రధానమంత్రిఅయ్యేయోగం వుందని గట్టిగాచెప్పారు. అందువల్లనే వీరిని నిలబెట్టాం. వీరు జమీందారన్నది మరిచిపోండి. వ్యక్తులను చూడకండి. కాంగ్రెసు మహాసంస్థను చూడండి; కాదంటె నన్ను చూడండి. కాంగ్రెసు మహాసంస్థ మీకు తెలియంది కాదు. బ్రిటిష్ప్రభుత్వంతో హోరాహోరిగా పోరి, శాంతి సమరం సాగించి, ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి, ఎంతో త్యాగంచేసి, స్వాతంత్ర్యం సాధించి ఈ నాటికిరామరాజ్యం స్థాపించింది కాంగ్రెసు మహాసంస్థే.

ఒకడు: అయ్యా! అదంతా మాకు తెలుసు. మిమ్మల్ని ఒక్క విషయం అడగదలచుకున్నాం. దయచేసి జవాబు చెప్తారా.

మంత్రి: ఎవడ్రా వాడు!

ఒకడు: నేనయ్యా. పోయినసారి మీకు ఓటిచ్చి గెలిపించిన ప్రజల్లో ఒకడిని. దయచేసి ఒక్క విషయానికి జవాబు చెప్పండి.

మంత్రి: మీరు చెప్పేది నాకు వినపడలేదు. కనుక జవాబు చెప్పే అవసరం లేదు.

అందరు: చెప్పాలి. చెప్పితీరాలి. చెప్పాలి.

కంఠం: సోదరులారా చెప్తాం. చెప్తాం. గాంధీమహాత్ముడు మనకు నేర్పిన ఆ యొక్క అహింసాసిద్ధాంతం మరచి పోకండి; ప్రశాంతంగా అడగండి.

ఒకడు: అయ్యా! కాటూరు సంఘటన అందరికీ తెలిసిందే. ఆడా మగా తేడాలేకుండా బట్టలూడదీయించి నడి బజార్లో నడిపించారు. కొరడాలతో కొట్టారు. అమా యిక ప్రాణాలను ఆహుతిచేసుకున్నారు. ఇంతటి దౌర్జ న్యం ఏ దేశంలోనైనా, ఎప్పుడైనా ఏ ప్రభుత్వమైనా జరిపిందా? సామ్రాజ్య వాదులైన బ్రిటీష్‌వారి పరి పాలనలోనైనా యింతటి ఘోరం జరిగిందా అని అడుగు తున్నాను.

మంత్రి: ఎవడా అల్లరివెధవ! గెంటించండి వాడిని.

ఒకడు: అడిగితే గెంటిస్తారు. ఇంకా అడిగితే కాల్చేస్తారు. అంతేకదా మీరు చేసేది. అమాయకుడైన పిచ్చ య్యను ఏంచేశారు. ఏ పార్టీలతో రాజకీయాలతోనూ సంబంధం లేనివాడు. వ్యక్తిగతంగా మీకున్న మన స్పర్థలతో అకారణంగా కాల్చి చంపేశారు. అతను చేసిన నేరం ఏమిటి చెప్పండి.

అందరు: అవును. అన్యాయం. దౌర్జన్యం. చెప్పండి. జవాబు చెప్పండి.

జగ: ఇలాగే అల్లరిచేశారా! మిమ్మల్ని అణిచేమార్గం నాకు తెలుసు. దేశశాంతికి, ప్రజాశాంతికి భంగం కలిగించే ఎవరినైనా సరే ప్రభుత్వం సహించదు.

జనం : ఓయబ్బో! ప్రజాశాంతట [illegible] మేమంతా ఎవ్వరం?
ప్రజలంకామూ! ప్రజలే అడుక్కుంటున్నామూ? చెప్పండి?

జగ : మీరు ప్రజలుకాదు. అల్లరిమూక.

జనం : ఏయ్ ఏం కూశావ్?

జగ : దౌర్జన్యానికి దిగారా! ప్రభుత్వం నరసింహావతారం దాలుస్తుంది. ద్రోహాల్ని కాల రాచేస్తుంది. అవుసర మైతే ఆయుధబలం వినియోగించటానికి వెనుదీయం. దౌర్జన్యానికి దౌర్జన్యమే; అహింస అంటూ ప్రభుత్వం పడివుండదు. అహింస అని వ్రాసుకునేకాలం పోయింది.

భార : (ఇంట్లో ఇదంతా విన్నది. నఖశిఖపర్యంతం వణికిపోయింది. కళ్లనిప్పులు చెరుగుతున్నాయి. పెరుగుతూన్న ఆవేశాన్ని, సభలో రేగుతున్న ఆందోళనను అనుసరించి ఇక్కడ రాట్నం వేగం పెరుగుతూంది. ఇక భరించలేక చర్రుమని లేచింది. రాట్నం మాత్రం విష్ణుచక్రంలా తిరుగుతూంది. ఆమె చరాలున వాకిలి తలుపు తెరచి, వెర్రిగా అరచింది) ఆపరా దౌర్భాగ్యుడా, ఆపు! నీ వెధవ కూతలు ఆపు. అహింసకు కాలం పోయిందా, ఇంకా కాలం పోలేదు. ఎప్పటికీ పోదు. (బయటగోల అణిగింది. భారతమ్మ పాతాళానికి క్రుంగిపోయింది. మనిషిలా మెల్లగా తిరిగి లోపలికి వచ్చింది. తనలోతాను గొణుక్కుంటూ వుంది.) వీడెందుకింకా బ్రతుకుతున్నాడు? నా కడుపులో యీ చిచ్చుపెట్టటానికా? ఎందుకు? ఈ క్షుద్రాన్నంతా చూడకుండా నేనైనా పోరాదూ? (కూలబడి పోతుంది)

ఒకడు: అమ్మా అమ్మా! బాబుగారు వస్తున్నారు.

[ఇంతలో ఇంకొకడు ఒక మడతకుర్చీ తీసుకువచ్చాడు. దాన్ని అక్కడ వేయబోతాడు. భారతమ్మ చూసింది.]

భార : ఎందుకురా అది?

వాడు: అయ్యగారి క్షమ్మా.

భార : తీసుకుపో!

వాడు: (జంకుతున్నాడు.)

భార : (గట్టిగా) పో, బైటికి. తీసుకుపో, ఊం.

వాడు: (కుర్చీ తీసుకుపోతాడు.)

[మొదట వచ్చినవాడు చేతులుకట్టుకుని నిలుచున్నాడు. కారు హారన్, చాలాసార్లు "తప్పుకోండి- తప్పుకోండి" అని కేకలు. జగన్నాథం వస్తున్నాడు. గడపదగ్గరుండగానే జగన్నాథం తుమ్మాడు. ప్రక్కన వున్నవాడు టవలు అందించాడు. జగన్నాథం మూతి తుడుచుకుంటూ వచ్చాడు. మనిషి బాగా నిమ్మపండులాగా నిగనిగలాడుతున్నాడు. కాయకల్పం చేయించుకున్నవాడిలా వున్నాడు. షేర్వాణీ, షరాయి, ఖద్దరుటోపీ యిదీ అతని వేషం.]

జగ : ఏమమ్మా! ఎలా వున్నావు!

భార : (ఏమీ జవాబివ్వకుండా వాకిలిదాకా వెళ్ళి బైటికి అటూ ఇటూ చూసి తిరిగివస్తూ, చేతులుకట్టుకుని నిల్చున్న అతనితో) అబ్బాయ్! నువు కాస్త అవతలికి వెళ్ళు. (అతను వెళ్ళాడు.) ఆ పోలీసులెందుకురా అక్కడ?

జగ : ఏదో వుంటానులే అమ్మా. వచ్చీరాకముందే మొదలు పెట్టావూ? ఇదిగోమ్మా! నిన్నొక విషయం చివరి సారిగా అడిగిపోదామని వచ్చాను.

భార : నేనూ, నిన్నొక విషయం చివరిసారి అడుగుదామనే పిలిపించాను.

జగ : అయితే ఢిల్లీకి వస్తావా?

భార : ఢిల్లీకివచ్చి నే నేం చేసేదిరా? నన్నే దేశానికి పంపుతావు- రాయబారిగా?

జగ : సరేలేవమ్మా! ఎప్పుడూ నీతో వుండేగోలే? మా ప్రభుత్వమన్నా, మేమన్నా నీకు పరిహాసమైపోయింది. అందరిలాగా నువ్వేమన్నా రాజకీయాలు తెలియని దానివా దబాయించడానికి! రాజకీయాలు నీరక్తంలో యింకిపోయాయి. నువ్వంటూనే వుంటావు, నేను పడుతూనేవుంటాను. కానీ నువ్వు బయల్దేరి వచ్చేయమ్మా! ఈ బాధలన్నీ నీ కెందుకు! నలుగురూ నన్నంటున్నారు ఇంత పెద్ద నాయకుడైనాడుగాని కన్నతల్లి కింతతిండి పెట్టలేదని.

భార : నన్నా అంటున్నారురా, కన్నతల్లిగావుండి కొడుక్కి ఆ మాత్రం మంచీ చెడ్డా చెప్పలేకుండా పోతూందని.

జగ : ఏమిటమ్మా ఆ మంచీ, చెడూ? ఎవరు నిర్ణయించేది? ఎవరు ఎవరికి చెప్పేదీ? అయినా నీతో వాదించటానికి నాకు తీరిక లేదుగాని.

భార : ఏం, టీ పార్టీవుందా? డిన్నరుందా?

జగ : అమ్మా, నువ్వనవసరంగా నన్ను బాధపెడుతున్నావు. ఇదే యింకొకరంటే బాగా జవాబు చెప్పేవాడిని. నీకేదో రాజకీయాలు తెలుసుగాని, అందులోవున్న డొంకతిరుగుళ్ళన్నీ అర్థంకావు. నువ్వింకా సత్యకాలం మనిషిలా ముక్కుకు సూటిగా పోతామంటే వీల్లేదు. దేశభక్తిఅని కళ్ళుమూసుకొని నిప్పుల్లో దూకితే ఏం లాభం ?

భార : పోనీలేరా ! మీరు పూలల్లో పడుకుని, మిమ్మల్ని నమ్ముకున్న ప్రజల్ని నిప్పుల్లో దూకించండి.

జగ : సరేలేవే ! నువ్వు చచ్చేదాకా యింతే ! నువ్వు మారవు. మరి నేను వెళ్లొస్తా.

[ ఇంతలో ఒకడు వచ్చాడు ]

వాడు: ప్రోగ్రాం సరిగ్గా ఆరుగంటలకని మునసబుగారు చెప్పి రమ్మన్నారయ్యా.

భార : ఏం ప్రోగ్రాం నాయనా !

వాడు: విజయలక్ష్మి కాఫీక్లబ్ ప్రారంభోత్సవం అమ్మా.

భార : ఊహుం ! చాల ఘనకార్యమే. (అంటూ చురుగ్గా చూచింది జగన్నాథంవైపు)

జగ : వస్తానమ్మా !

భార : ఒరే అయిదునిమిషాలుండు నీతో మాట్లాడాలి (ఆజ్ఞాపించింది)

జగ : (వచ్చినవాడితో) వెళ్ళి చెప్పవోయ్ వస్తున్నామని. (వాడు వెళ్ళాడు) ఊఁ, చెప్పమ్మా ఏమిటో !

[ అంటూ ఇటూ, అటూ యిల్లంతా కలయచూచి స్టూలుమీద వున్న విగ్రహాన్ని క్రిందికుదించి కూర్చున్నాడు, ఆస్టూలుమీద ]

[ భారతమ్మ చాలా నిశితంగా చూస్తుంది. ]

జగ : చెప్పవేం !

[ భారమ్మ పలకలేదు; అలాగే చూస్తుంది. ]

జగ : (ఆ చూపులకు మాడిపోయాడు. తను చేసినపని గుర్తించాడు. సర్దుకుంటూ లేచాడు.) కానీయమ్మా చెప్పు మరి !

భార : మనవంశం ఎట్లా వుండేదో, ఇప్పుడెట్లా అయిందో, ఎందుకిలా అయిందో నీకు జ్ఞాపకముందా ?

జగ : బాగా జ్ఞాపకముందమ్మా.

భార : ఒకసారి గాంధీమహాత్ముడు మనయింట్లో విడిదిచేశాడు. అప్పుడు నువ్వు ఆయన్ని "తాతా ఒక్కసారి నవ్వు" అని అడిగావు. పది రూపాయలు యిస్తే నవ్వుతా నన్నాడు. చేతిలో మురుగులుతీసి యిచ్చేశావు. నిన్నా యన ఆశీర్వదించారు. ఏమనిఆశీర్వదించారో గుర్తుందా?

జగ : లేకేమమ్మా; ఇదంతా ఆయన ఆశ్వీరాదమేగా ?

భార : హుఁ ! మీా అన్నయ్య సత్యాగ్రహంలో తుపాకికి గుండె చూపాడు. పోలీసులు కాల్చేశారు. ప్రాణాలు వదుల్తూ నీతో, నాతో ఏమిచెప్పాడో గుర్తువుందా ?

జగ : ఇప్పుడదంతా ఎందుకమ్మా.

భార : ఎందుకో కాదు. భవిష్యత్ కు మంచి బాట వేసుకోవాలంటే, గతం జ్ఞాపక ముండాలి.

జగ : ఆ కాలాలు వేరమ్మా!

భార : కాలంలో ఏముందిరా? మతులు చెడి మనం మారాం గానీ, కాలం అలాగేవుంది. మంచికెప్పుడూ కాలం వుందిరా.

జగ : అదంతా వట్టి పిచ్చిమాటలమ్మా. అంతర్జాతీయంగా పరిస్థితులు అల్లకల్లోలమైపోతున్నాయి. ప్రపంచమంతా ఒకమహాప్రవాహంగా ఎక్కడికో కొట్టుకొనిపోతోంది. ఈ మహాప్రవాహంలో మన మెంత? మొన్న మొన్న పుట్టిన వాళ్ళం. ఆ ప్రవాహాన్ని ఎదురీదమంటే కాని పని. ఊరికే ఇక్కడ కూర్చొని కబుర్లు చెప్పినట్లు కాదు. ఒక్కొక్క సమస్య కొండలా నెత్తినపడుతూంటే తప్పించుకుని వూపిరితిప్పుకునేప్పటికి తలప్రాణం తోక కొస్తూంది. ఓర్వలేని వెధవలు...

భార : జగ్గూ, (క్షణం నిశ్శబ్దం) చేతలుమాని మాటలు నేర్చారురా మీరంతా. అందుకే, మహాత్ముడానాడు స్వరాజ్యం రాగానే అన్నాడు, ఇక కాంగ్రెసును రద్దు చెయ్యండి అని. ఆయనకు బాగా తెలుసు. మనం ఆందోళన చేయటానికి అలవాటు పడ్డాంగాని పరిపాల నకు పనికిరామని...అదికాదురా, మిమ్మల్ని ప్రజలు ఎన్నుకున్నది అంతర్జాతీయ పరిస్థితుల్లోపడి కొట్టుకోటా నికా! ఇప్పుడు నువ్వు ఆ జోగయ్యకొంపలో దిగ టానికీ, మాలవాళ్ళు చచ్చిచెడి సాగుచేసుకున్న భూముల్ని మీలో మీరు పంచుకోటానికీ, ముత్యా లయ్యకు మీ మద్దతుయిచ్చి వాళ్ళకు నిలువ నీడలే

కుండా చేయటానికీ అంతర్జాతీయ పరిస్థితులురా కారణం ?

జగ : ఎవరు చెప్పారు నీ కిదంతా ?

భార : ఒకరు చెప్పాలా ! నీ అంతరాత్మను అడగరా చెప్తుంది. బాపూజీ పవిత్రంగా ప్రవేశపెట్టిన యీ ఖద్దరులో దొంగలు దాక్కున్నారురా యీనాడు.

జగ : అమ్మా ! (వెళ్ళబోతున్నాడు)

భార : (అతని చేతులు పుచ్చుకుని) నా మాట వినరా. వద్దురా మనకీ క్షుద్రం. సంస్థానంలాంటి సంసారం చితికి పోతూంటే సహించాను. మన యింట్లో నౌఖరుగా వుండి పోలీసులో చేరిన వెంకడు దేవుడిలాంటి మీ నాన్నను బూటుకాళ్లతో తన్నుతుంటే చూస్తూ భరించాను. కాంగ్రెస్ వాడైతేగాని నా అల్లుడు కావటానికి వీల్లేదని పెద్దపెద్ద సంబంధాలను మీ నాన్న కాలదంతూంటే గర్వించాను. చివరికి చెల్లెమ్మ విధవైంది. ఆ కష్టంలోనే అదీ కన్నుమూసింది. ఇప్పుడీగతి పట్టింది. చింత లేదు. నువ్వింత పెద్దపదవికివస్తే ఓర్వలేని తనమా నాకు ? కన్నతల్లిని నేను సంతోషించవలసిన దాన్ని కదరా ! కానీ బాధపడుతున్నాను దేవుడు నన్నెందుకింకా బతకనిచ్చాడా అని. నా బాధ నీకు తెలియదురా తండ్రీ. ఎంతమందిరా ? ఎన్నికోట్లమంది ప్రాణాలు యిచ్చి పెంచుకొచ్చారీ కాంగ్రెసును ? పోతూందిరా నాయనా, నాశనమై పోతూందిరా. (ఏడుస్తుంది)

జగ : (కరిగిపోయాడు) అమ్మా, యిప్పుడు నన్నేం చేయ మంటావమ్మా ? రాజీనామా యివ్వమంటావా ?

భార : రాజీనామా యిస్తే చేసినపాపం ఎట్లా పోతుందిరా ? వెళ్ళండి. ప్రజల దగ్గరకెళ్ళి, మీరు చేసిన పాపాల్ని ఒప్పుకుని, లెంపలు వేసుకోండి. ఈ పాపం యిట్లాగే పెరిగిందా, ప్రజలు మిమ్మల్ని క్షమించరు. మీరక్తం కళ్ల చూస్తార్రా వాళ్లు.

జగ : అమ్మా ! మరీ అఘాయిత్యం చేస్తున్నావు. అదంతా ఏమీ వీలులేదు. ప్రజల దగ్గరకెళ్లి క్షమాపణలు కోరు కోవటం ఎన్నటికీ జరగదు. అలా జరిగితే ఏమవు తుందో తెలుసా ? ప్రభుత్వం పడిపోతుంది. కాంగ్రెస్ నామరూపాల్లేకుండా పోతుంది.

భార : ఇంకా ఎక్కడుందిరా కాంగ్రెస్. కాంగ్రెస్సే కనుక వుంటే, యీ అడ్డమైనవాళ్ల కాళ్లూపట్టుకుని కలుపుకో వలసిన కర్మేమొచ్చిందిరా. నిజాయితీవున్న ఒకరిద్దరూ రాజీనామా లెందుకిస్తార్రా! ఇంకా సిగ్గులేక 'కాంగ్రెస్ కాంగ్రెస్' అని ఒక శవాన్నిచూపి బెదిరిస్తున్నారా, మీ బతుకు చెడ !

జగ : అమ్మా, యీ రాజకీయాల్లో నువ్వు రక్తపాశాన్ని కూడా తెగ తెంచుకుంటున్నావు.

భార : అదికాదురా. నిన్నాశీర్వదించాల్సిన తల్లిని అర్థిస్తు న్నాను. మన వంశంలో ఒక దేశద్రోహి పుట్టాడన్న అపకీర్తి తీసుకురాకురా. మనకీ పదవులు వద్దు: ఇట్లాగే పస్తులుండి చస్తాం కావాలంటే...వద్దురా.

జగ : అమ్మా! చివరిసారి చెప్తున్నాను. నువ్వు రాజకీయాల్లో తల దూర్చకుండా వచ్చేటట్లుంటే రా! లేకపోతే నీకూ నాకు ఏమీ సంబంధం వుండదు. నీ ముఖం చూడాల్సిన అవసరంకూడా వుండదు (వెళ్తున్నాను)

భార : (చేయిపట్టుకుని ఆపింది) ఆగు! పిచ్చయ్యను ఎందుకు చంపించావో చెప్పి వెళ్లు.

జగ : చెప్పటానికి వీల్లేదు.

భార : చెప్తావా, లేదా ?

జగ : నువ్వెవరు నన్నడగటానికి ?

భార : నేనా నీ కన్నతల్లిని.

జగ : నువ్వు నా తల్లివీ కావు, నేను నీ కొడుకునూ కాదు.

భార : ఆఁ, అంతదూరం వచ్చావా? అయితే నేను భారత దేశ ప్రజల్లో ఒక తెను. అడుగుతున్నాను. కాళ్లమీద పడి ఓప్పుకో తప్పును.

జగ : ఒప్పుకోటంగాదు. అటువంటి పిచ్చయ్యలు వెయ్యి మందినయినా చంపుతాం. ప్రభుత్వానికి ఎదురుతిరిగిన వాళ్లను ఎవరినైనా సరే సహించం, చంపుతాం.

భార : చంపుతారా? నే నెదురు తిరుగుతున్నాను. చంపరా, చంపు.

జగ : అమ్మా! నిన్నెవరు రెచ్చగొట్టారో నాకు తెలుసు. వాళ్ళనేం చేయాలోకూడా నాకు బాగా తెలుసు. సుబ్బన్నా, (సుబ్బన్న వచ్చాడు) మలబారు పోలీసుల్ని పిలిపించు. మాలగూడానికి కాపలా పెట్టించు.

సుబ్బన్న: అవన్నీ ఎప్పుడో చేసేశామయ్యా! ఈ పాటికి చాలా దూరం అయిపోయివుంటుంది.

భార: ఆఁ!

[జగన్నాథం నవ్వాడు]

[ఇంతలో వాకిటినుంచి 4, 5 గురు స్త్రీలు పిల్లల్ని చంకన వేసుకుని, కంగారుగా పరుగెత్తుతూ, రక్తసిక్తవస్త్రాలతో "భారతమ్మా భారతమ్మా" అని అరుస్తూ వచ్చారు.]

స్త్రీలు: భారతమ్మా, భారతమ్మా! అయిపోయింది. అంతా అయిపోయిందమ్మా. మా గూడెం అంతా మసి అయిపోతా వుందమ్మా. రండమ్మా. మీరన్నా వచ్చి రచ్చించండి.

భార: ఏమిటి యీ గాయాలు? ఈ రక్తం అంతా ఏమిటే?

స్త్రీలు: పోలీసోళ్ళు వచ్చిపడ్డారు. కనబడ్డోళ్ళను కనబడ్డట్టు తల పగలగొడుతూండారమ్మా.

భార: ఆఁ!

స్త్రీలు: కన్నూ మిన్నూ కానకుండా పైబడుతుంటారు. మొగాళ్ళను దిసమొలల్తో వూరేగింపుచేసి గాంధీ యిగ్రహం కాడ నిలబెట్టి కొడుతుండారు. ఆడోళ్ళనూ యిడిసి పెట్టట్టులేరు. రాచ్చసుల్లాగా గుడిసెల్లోదూరి మూలనున్న ముసలమ్మల్నికూండా లాగి బైటేస్తున్నారమ్మా. సూస్తే ఎంతకాడికన్నా ఎళ్ళేట్టుంది.

భార: వూళ్ళో అందరూ ఏమయ్యారే?

స్త్రీలు: ఒక్కడూ నోరు మెదపలా. సూస్తా నిలబడుతుండారు గానీ! రండమ్మా మీరన్నారండి. మీరొచ్చి అడ్డం నిలిస్తే ఆ ఆగం ఆగుతుందేమో రండి. రండమ్మా.

స్త్రీలు: తల్లీ! మా మానం కాపాడమ్మా.

[ జగన్నాథం విరగబడి నవ్వాడు ]

భార : (వణికిపోయింది కోపంతో) ఛండాలుడా! ముయ్ నోర్! సిగ్గులేకుండా నవ్వుతున్నావా? ప్రజా విశ్వాసం పోగొట్టుకుని చివరికిట్టాంటి పాడుపనులకు దిగారా? ప్రజల కీనాడు ఆలోచించే శక్తి కలిగించిరా? దౌర్జన్యంతో హింసించి భయపెట్టి, ఒక్క ఓటుకూడా వేయించుకోలేర్రా! జాగ్రత్త!

జగ : ప్రాణాలు – తీసైనా వేయించుకుంటాం!

భార : ప్రాణాలు తీస్తారా? ఎలా తీస్తారో చూస్తాను. పదండి, నేనొస్తున్నాను. మీరు పదండి. (మూలనున్న కర్ర తీసుకుంది. వాళ్ళు కదిలారు. భారతమ్మ గబగబా వెళ్తోంది.)

జగ : (ఆమెను ఆపాడు) అమ్మా, ఎక్కడికి?

భార : మీ దౌర్జన్యానికి సమాధి కట్టటానికి?

జగ : వెళ్ళి ఏంచేస్తావ్! పోలీసులతో యుద్ధం జేస్తావా?

భార : చేస్తానురా. ధర్మయుద్ధం చేస్తాను. ఈ రక్తంలో ఇంకా నైతికబలం వుందిరా. దేశాభిమానం, ప్రజాభిమానం యింకా చావలేదురా ఈ దేహంలో. ఒకనాడు తెల్ల వాళ్ళమీద యుద్ధం. ఈనాడు తెల్లటోపీలమీద యుద్ధం!

జగ : ఆఁ! చెయ్యాల్సిందే యుద్ధం. అక్కడ బదులు చెప్పాల్సింది మాటలుకాదు-తుపాకీ తోటాలకు.

భార : దౌర్భాగ్యుడా! సత్యాగ్రహంతో జీవంపోసుకున్న మీరు తుపాకికి ఎంత విలువిస్తున్నారా? లే అడ్డం!

జగ : అమ్మా, నువ్వోళ్ళటానికి వీలులేదు.

భార : ఒరే, జగ్గూ!

జగ : అమ్మా ఇక్కడనుంచి కదిలావా?

భార : ఏం చేస్తావురా?

జగ : ఏం చేస్తానా? (చేయెత్తుతాడు)

[ భారతమ్మ అలాగే చూచింది. జగన్నాథం ఆగాడు. ]

భార : కొట్టలేక పోయావేం? కొట్టరా. కొట్టు.

జగ : వెళ్ళావా? కొట్టటంకాదు, చస్తావు.

భార : చస్తానురా! నీలాంటి వెధవకు తల్లిగా బతికుండటం కన్నా, ప్రజలకోసం ప్రాణాలిస్తానురా. (పోబోతుంది)

[ బైట గోల - కేకలు, ఏడుపులు ]

జగ : అమ్మా! (విసిరికొట్టాడు. భారతమ్మ ఒక మూలగా పోయి పడింది. అక్కడేవున్న కత్తిపీటమీద చేతులు పడ్డాయి.) నోరుమూసుకుని పడివుండు. పిచ్చిపిచ్చి వేషాలు వేశావా? ఇంతవరకు కన్నతల్లి అన్న మర్యాద చూపించాను. ఇక అదీ వుండదు. గౌరవంకొద్దీ వూరుకుంటే మరీ నెత్తినెక్కి పోతున్నావు. ఏమిటి నీ అధికారం? అహింసట, అహింస! ఏరీ నీ అహింసా సత్యాగ్రహులు-చూద్దాం. ఎవర్రా అక్కడ! దీన్ని తీసుకెళ్ళి తోయండిరా జైల్లో.

[పోలీసు వచ్చాడు. జగన్నాథం వెనుతిరిగి వెళ్తున్నాడు. భారతమ్మ స్పృహమని లేచింది. "జగ్గా" అంటూ చేతనున్న కర్ర విసిరింది. జగ్గుతల దిమ్మెక్కింది. పోలీసు జగ్గూను పట్టుకున్నాడు. తమాయించుకొని "అరెస్టు" అని ఆజ్ఞాపించాడు. పోలీస్ భారతమ్మను సమీపించాడు. "వస్తున్నా" అని చేతితో సంజ్ఞ చేసి భారతమ్మ ఒక్కసారి బాపూజీకి నమస్కరించింది]

భార : అందరినీ అర్పించాను. మంచికే అర్పించాను. వీడొక్కడు మిగిలాడు. వీడుండటం దేశానికి శ్రేయస్కరం కాదు. కన్నతల్లిగా నా ప్రయత్నం నేను చేశాను. ఇక వీణ్ణి ప్రజల కప్పజెప్పి వెళ్తున్నాను. (ప్రజలు తన ఎదుట ఉన్నట్లే ఆవేశంతో) మళ్ళా మళ్లా మోసపోకండి. దేశాన్ని కాపాడుకోండి.

[నేపథ్యంలో ఒక కంఠం]

ధన్యవో తల్లి ! నిను కన్న ధాత్రి ధన్య
అందుకో మాడుకోట్ల జోహార్లు నీకు
దమననీతికి బలియైన త్యాగమూర్తి
నడచివత్తుము మేము నీ అడుగుజాడ !

[భారతమ్మ గంభీరంగా నడిచివెళ్ళింది. పోలీసు ఆమెవెంబడి వెళ్ళాడు. మంత్రిసత్తముడు అలాగే నిలబడివున్నాడు. ఒక్క క్షణం వ్యవధి. తరువాత బైట కొన్నికోట్ల గొంతుకల పాట.]

తరలిందీ !
తరలిందీ !
ప్రజావాహిని తరలింది !
ప్రజా ద్రోహులను తరిమింది !

గిరులను ముంచి
దరులను త్రెంచి
నురుగులు చెరుగుతు
వురికిందీ !
వెరపులు మాపి
వెలుగులు చూపి
విశాలాంధ్రగా
వెలిసిందీ !
అజేయశక్తి
అనంతదీప్తి
ఆంధ్ర ప్రజలలో
కలిగిందీ !
అనాదిగా యీ
జనాన్ని దోచే
అమానుషత్వం
అదిరిందీ !
ప్రజాశక్తియే గెలిచిందీ !
ప్రజారాజ్యము నిలిపిందీ !
నిజాయితీగా సజాతీయముగా
ధ్వజారోహణం చేసిందీ !

[ పాట, పాటతోపాటు ప్రజా ప్రవాహం తోసుకొస్తుంటే మంత్రి వణికిపోయాడు. గబగబ గాభరాగా కాలికి బుద్ధిచెప్పాడు. తెర ]



## పాత్రలు



| | | |
|---|---|---|
| రామయ్య | : | — — |
| సుబ్బన్న | : | రామయ్యకు రసికుడైన కుడిభుజం. |
| కోటిగాడు | : | రామయ్యకు బాడీగార్డు. |
| ఆనందరావు | : | ఈనాటి మంత్రి. |
| సత్యం | : | — — |
| చెవిటివాడు | : | రామయ్యయింట్లో చాకిరిగాడు. |
| వెంకటాద్రి | : | — — |
| మోహన్ | : | రామయ్య చిన్నకొడుకు. |
| రాముడు | : | — — |
| చిన్నయ్య | : | — — |

ఇంకా మరికొందరు ప్రవేశిస్తారు.

కాలం : ఈనాడు.

స్థలాలు : రెండు. 1 రామయ్య ఇల్లు. 2 కార్మికుల గూడెం.
1, 3. దృశ్యాలు రామయ్య ఇంట్లో. 2, 4. గూడెంలో.



౧

[ రామయ్య ఇల్లు: ఒక హాలు. బాగా అలంకరింపబడి వుంది. హాలులో బల్లలు తుడుస్తూ ఒకడున్నాడు. వాడి పేరేమిటో ఎవ్వరికీ తెలియదు. చెవిటివాడు గనుక 'చెవిటిగా'డంటా రందరు ]

చెవిటివాడు: (బల్లలు తుడుస్తూ)

అన్నమైతేనేమిరా - మరి
సున్నమైతేనేమిరా - యీ
పాడుపొట్టకు ఆకలణిగే అన్నమే వేతామురా,
కాంగ్రెసైతే నేమిరా - మరి
కమ్యూనిస్టయితే నేమిరా
బువ్వపెట్టి గుడ్డయిస్తే
ఎవ్వరైనా ఒకటేరా,
ఎర్రపెట్టె అని యేమిరా - మరి
పసుపుపెట్టె అని యేమిరా
మాటతప్పని మంత్రినైతే
ఓటు ఆయన కివ్వరా! (పాడుతున్నాడు)

[ సుబ్బన్న వచ్చాడు. కళ్ళద్దాలు, చేతి కర్ర, పైపంచ అతని ఆత్మబంధువులు. ]

సుబ్బ: ఏమిటోయి! మహా యిదిగా పాడేస్తున్నావు సంగీతం?

చెవి: అయ్యగారాండి - వుండారు దొరా (వెళ్ళాడు)

[ కోటిగాడు వచ్చాడు. కోరమీసాలు, కోరచూపులు, అతని ఆభరణాలు... ]

సుబ్బ : కోటిగా, మేడమీాద జండా కట్టారా ?

కోటి : కట్టాం.

సుబ్బ: అయ్యగా రేంచేస్తున్నారు ?

కోటి : ఏమోానండి.

సుబ్బ: హారాలవీ కాకులో పెట్టారా ?

కోటి : ఊఁ— పెట్టాం.

సుబ్బ : ఆ సత్యాన్ని యీారోజు కాస్త గమనిస్తున్నావా ?

కోటి : అయన్నీ, అయ్యగారితో శెప్పాను లేండి.

సుబ్బ : ఏమిట్రా అడుగుతుంటే అంత ఇదిగా జవాబిస్తావ్ ?

కోటి : ఏం లేదు.

సుబ్బ : సరేగాని – కోటిగా !

కోటి : అదే–ఆ మాటే అనొద్దన్నాను.

సుబ్బ : ఏ మాటరా ?

కోటి : కాకుంటే కోటిగా యేంటి ? కోటయ్యా అనలేరు ? ఏమంత తీసేసున్నాము గనుక ?

సుబ్బ : ఓ – ఒరే యీా మధ్య యిదంతా చూాస్తే కమ్యూనిష్టయినట్టున్నావే ?

కోటి : కాంగ్రెస్‌లో అట్టా అనమని వుందామేం ?

చెవిటి: (వచ్చాడు) కోటిగా !

కోటి : గూాబ పగల్దన్నాను. చూాడు. (విసురుగా వెళ్ళాడు)

చెవిటి: అయ్యగారొస్తుండా రండి.

[ వెంకటాద్రి వచ్చాడు. జన్మవల్ల బాపడు. కానీ చూట్టాని కలా వుండడు. వయస్సు 30 ఆ ప్రాంతమే గానీ ఏ అరవైయేళ్ళ మనిషిలా వుంటాడు. సంస్కార మెరుగని జుట్టు, గడ్డం. చాకలి యిల్లు యెరుగని బట్టలు, గుండీలు లేని చొక్కాలోనుంచి ఎండిపోయిన గుండెలు కనిపిస్తూ వుంటాయి. ముఖం అతి తీక్షణంగా వుంటుంది మడతలు పడి. ఇతన్ని కొందరు పరోక్షంలో "కల్యాడు" అంటారు. ఆ పేరు యెందుకొచ్చిందోగానీ, అతని సమక్షంలో ఆ మాటంటే ఫలితం యెలా వుంటుందో అనుభవంమీద తెలియాలి. యెప్పుడూ ఒక లావాటి పుస్తకం మోస్తూవుంటాడు. ఆపుస్తకాన్ని మోయగలడా అని పిస్తుంది చూస్తే. యింతకన్నా వివరాలు యిప్పటికి తెలియవు... ]

[ వెంకయ్య వచ్చి సుబ్బన్న ప్రక్కనున్న కుర్చీలాగి కొంత దూరంలో వేసుకొని కూర్చున్నాడు పలకకుండా...... ]

సుబ్బ : (కాస్సేపట్టే ఆ వ్యక్తివంక చూచాడు) అయ్యగారి కోసం వచ్చారా ?

వెంక : కాదు. నా కోసమే! (తెగ్గొట్టినట్లుంది జవాబు)

[ సుబ్బన్న ఒక్కక్షణం ఏం మాట్లాడాలో తెలియక వూగ్గాన్నాడు. క్షణకాలం నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దతను చీల్చుకొని బూట్లచప్పుడు వినిపించింది. సుబ్బన్న పైపంచ, కళ్ళద్దాలు కాస్త సర్దుకొని ఆదుర్దాగా అటువైపు చూస్తున్నాడు. వెంకటాద్రి ఇవేవీ పట్టించుకోలేదు....... ]

[ రామయ్య వచ్చాడు. గడియారం 5 కొట్టింది. రామయ్య అంత ముదురుమనిషి కాదు. 40 ప్రాంతం వుంటుంది. అంతా తెల్లటి దుస్తులు...ఖద్దరు, కారణం ఏమోగానీ ఆ దుస్తులతో నడుస్తూన్నపుడు కొంచెం తడబడుతూంటాడు ఏదో కొత్తగాఉన్నట్లు... ]

సుబ్బ : నమస్కారం.

[ రామయ్య అంటుకొన్నాడు; వెంకయ్య ఊర్కే
తలెత్తి చూచాడు. మరలా వంచేశాడు.... ]

రామ: సరీగ్గా 6 గంటలకు వస్తారంటావా? సుబ్బన్నా!

సుబ్బ: వస్తారనే - వచ్చినా రాకున్నా మనం అక్కడ హాజరు కావాలనుకుంటా.

రామ: అవును మరి! మన ఆనందయ్య అయినా మంత్రి అయిన తర్వాత మర్యాద వేరే అంటావు?

సుబ్బ: అందుకే "తానబలిమికాని తనబలిమి కాదయా" అన్నాడు వేమన.

రామ: బలే! బలేగా అన్నావు (పెద్దగా నవ్వాడు. ఎందుకు నవ్వినాడో వెంకటాద్రికిగానీ, చెవిటయ్యకిగానీ చివరికి సుబ్బన్నకు, రామయ్యకైనాగానీ అర్థంకాలేదు, తెలియదు. వెంకటాద్రి, చెవిటయ్య ఊర్కే చూచారు. సుబ్బన్న చేతులునలిపి వెకిలిగా నవ్వినాడు) సుబ్బన్నా!

సుబ్బ: అయ్యా!

రామ: చూడు- అదెందుచేతనో ఆ వేమన పద్యాలు చదువుతూంటే నాకు నిజంగా అంతకంటే మించిన కవిత్వం ఇంకేముందా యీ ప్రపంచంలో అనిపిస్తుంది. చూచావూ? అబ్బ! మానవ ప్రకృతిలో ఎన్ని ఎగుడు దిగుళ్ళు వున్నాయో-ఎంత చక్కగా చిత్రించాడోయ్! కేవలం అచ్చు గుద్దినట్లేకదూ? ఏమన్నా తేడా వుందంటావా?

సుబ్బ: అబ్బే! ఎవడంటాడండీ? అంత ఇదిగా రాసిన కవి మరి మన తెనుగు సాహిత్యంలోనే లేడంటారు తెలిసినవాళ్ళు.

రామ: (వెంకటాద్రిని ఇప్పటికి రెండు సార్లు చూచాడు కానీ పలకరించలేదు. ఏమనుకున్నాడో) ఆఁ అయితే వెంకటాద్రీ! ఏమలా మూల కూచున్నావు? ఈ రోజు మరీ హుషారుగా వుండవలసినవాడివి?

వెంక: ఎందుకూ హుషారు?

సుబ్బ: ఈ రోజు మీకంతా ఇదిగదాండి?

వెంక: ఆఁ– ఇదే!– (ముఖం త్రిప్పేసినాడు)

రామ: ఫలహారం చేశావా?

వెంక: భోంచేయ లేదు.

రామ: అరరె! అంత తీరిక లేని పనిమీద ఉన్నావా యేం?

సుబ్బ: భోజనం మానుకొని ఐనా చేయాల్సిన ఇది ఏమిటంటా!

వెంక: ఇదీ లేదు అదీ లేదు!

రామ: ఈ మధ్య మీ తండ్రిగారు చనిపోయారని విన్నాను—

వెంక: నేను జైల్లో వుండగానే పోయారు.

సుబ్బ: అవునండి. దాంతో మరీ ఇద్దైపోయినారు పాపం!

రామ: పాపం! సుబ్బన్నా! నువ్వెరగవుకానీ వెంకటాద్రిలాంటి వర్కర్ లేడంటే నమ్ము. అరరె! పాపం! సత్యాగ్రహంలో సర్వం ధారబోశాడు. త్యాగం చేశాడు. ఒకనాడు– నాకు బాగా జ్ఞాపకం. మన ఇంటి ముందు కూర్చున్నాడు – పీఠం వేసుకొని. ఇంటిమీది

జండాకట్టమని, సీమగుడ్డలు కాల్చేయాలని, సత్యా
గ్రహం. ఆ రోజుల్లో కొన్ని దినాల పర్యంతం నిరశన
దీక్ష పట్టేవాడు ఘట్టి శరీరం గనక. కదు వెంకట్రాద్రీ!

వెంక: ఈ రోజుల్లోకూడా! ఆకలి అలవాటయిందిలేండి!

రామ: ఇంతకూ వెంకట్రాద్రీ! చూచావా మన ఇంటిమీద
జెండా ఎలా ఎగురుతుందో!

వెంక: జెండా చూడలేదుగానీ మన ఇంటి కాంపౌండులోనే
వున్న కాపలావాని గుడిసెమాత్రం చూచాను.
కాస్సేపు ఆ చిరుగుల నీడలో పడుకున్నానుకూడా!

రామ: (కొద్దిగానవ్వి) కవిత్వం మాట్లాడుతావోయ్ ఎప్పుడూ
వెంకట్రాద్రీ! అదొక ధోరణి. ఏమంటావ్ ?

సుబ్బ: ఆ, ఇది కొందరికే జన్మతో వస్తుందండీ; వేమన వున్నాడే
వేమన—

రామ: మరచా-కాస్త ఫలహారం తీసుకుంటావా మా ఇంట్లో ?

వెంక: అక్కర్లేదు.

రామ: ఆనందయ్యతోపాటు ఇక్కడే భోంచేద్దువులే!

వెంక: ఆయనతోపాటు కాకుంటే ఆయన కయిన తర్వాత
తింటే పోయే దేముంది గనక!

రామ: స్టేషన్‌కు రావూ!

వెంక: నడవలేను.

రామ: కార్లో రా—

వెంక: ఎందుకులేండి — ఆయన వచ్చేవరకు నేనిక్కడే
వుంటాను.

రామ: దానికేం అలాగే వుండు. అది సరేగానీ-వెంకట్రాద్రీ ! ఆ శంకరం కమ్యూనిస్టులతో కలసి పోతున్నాడని విన్నాను. ఏ మాత్రం నిజం ?

వెంక : కాంగ్రెస్ అతన్ని కొన్నదా ఏం ?

రామ : నిజమేకదూ ? కమ్యూనిస్టులైతే జీతాలు - బత్తాలు యిచ్చి కొనగలరు. కాంగ్రెస్‌లో అంతా స్వంత ఆముదమేగా ?

వెంక : తమరు కాంగ్రెసు అభిమాను లెప్పుడయ్యారండీ ?

రామ: సుబ్బన్నా ! విన్నావటోయ్ వెంకట్రాద్రి ప్రశ్న ?

సుబ్బ : విన్నానండి.

రామ: నే నొకప్పుడు కాంగ్రెసు కానట్లు, ఇప్పుడేదో అయినట్లు భావిస్తున్నాడు. పాపం ? వెంకట్రాద్రికి యీ వుక్రోషం యీ యింటిమీద ఎప్పుడూ వున్నదేలే ! వెంక ట్రాద్రీ ! నేను కాంగ్రెసు నానో కానో నా అంత రాత్మకే తెలుసు. కాకుంటే ఏదో వ్యాపారం సాపారం చేసుకునేవాణ్ణి కనుక మీలాగు తెగించి బయట పడ లేదు సరేనా ? మీ ఆనందయ్యనే అడగరాదూ మొన్న ఎలెక్షన్లలో ఎంతపని చేశానో—

వెంక : నాకు తెలీదూ ? ఆయన్నడగట మెందుకు ? ఇదిగో - ఈ గ్రంథం చూచారూ? చిత్రగుప్తుని లెక్క. ఇందులో కాంగ్రెసు, కాంగ్రెసుకు సంబంధించిన అందరి చరిత్ర వుంది. సింహాసనా లెక్కవలసినవాడు, చీకొట్టించుకో

వలసినవాళ్ళు అందరి జాబితా వుంది. ఈ జాబితా
అమలు పెట్టేకాలం మాత్రం ఇంకా రాలేదు.

రామ: అదేమిటోయ్ కాంగ్రెసు ప్రభుత్వం వచ్చికూడా
కాలం రాలేదంటావు ?

వెంక : అవును, రాలేదు, ఇప్పట్లో రాదు.

రామ: సుబ్బన్నా ! ఎందుకో యీ రోజు వెంకటాద్రి వుడు
కులో వున్నాడు.

సుబ్బ : అవునండి, మాట్లాడితే మరీ ఇదవుతున్నారు.

వెంక : మీకు టైమయినట్లుందే !

రామ: అవునవును, సుబ్బన్నా ! బయల్దేరుదామా ?

సుబ్బ : ఆహా ! ఆక్షేపణ లేకుండా,

వెంక : నేనిక్కడే ఉండటానికి అనుమతించినట్లేనా ?

రామ: నిరభ్యంతరంగా వుండు. దానికేం (లేచి రెండడుగులు
వేశాడు. ద్వారందగ్గరకు వెళ్ళాడు. తటాలని ఆగాడు,
పామో, పురుగో కనపడ్డట్టు ఒక్కక్షణం. చరచర ఇంట్లోకి
వెళ్ళాడు. ఎందుకో ఎవ్వరికీ తెలియదు. సుబ్బన్నకు
మాత్రం అర్థమైంది. మెల్లగా తల వంచుకొని కుర్చీ
దగ్గర కొచ్చాడు.)

[ సత్యం వచ్చాడు. వెంకటాద్రి ప్రక్కన కుర్చీవుంది కానీ కూర్చోలేదు ]

వెంక : ఓ ! నువ్వేదుకు పడ్డావటోయ్ ! అదా సంగతి ! మరీ
ఇంత పాడు శకునం అయితే పాదం ఎలా బయట పెడ
తారు ? రా ! రా !

సత్యం: అయితే— నేనెదురొచ్చానని ఆయన వెనక్కి వెళ్ళారంటావు ?

వెంక : అనటం లేదు. అనుకున్నా, అంతే !

సుబ్బ : (ఎక్కడో ఆలోచిస్తూన్నవాడు, తటాలని మేల్కొని) కూర్చోండి ! ఏదో పనిగా వెళ్ళారు లోనికి...వస్తారు కూర్చోండి.

[ సత్యం కూర్చున్నాడు ]

చెవిటి: (వచ్చాడు) అయ్యగారు పిలుస్తుండారు.

[ సత్యం, సుబ్బన్న, ఇద్దరూ లేచారు ]

వెంక : మిమ్మల్ని కాదండి, కూర్చోండి, అంత తేలిగ్గా ప్రవేశాగ్న్యత లభిస్తుందనుకోటానికి ఎంత వెర్రివాడవు నువ్వు!

చెవి : (సుబ్బన్నతో) పిలుస్తుండారయ్యా.

(సత్యం, కూలబడ్డాడు. సుబ్బన్న వైపుచూ, కళ్ళు గాలు సర్దుకొని వెళ్లాడు. చెవిటయ్య కొంచెం ఆగి)

చెవి : దండాలండి !

[ సత్యం తిరిగి నమస్కారం చేశాడు. ]

చెవి : అయితే ఏమనుకున్నారండీ ఆ ఇసయం. అటో ఇటో తేల్చుకుంటే పోలా — ఎన్నాళ్ళని పడిసత్తా రిట్టా కూడు లేకుండా! (ఇంకా ఏదో మాట్లాడ బోతున్నాడు)

సత్యం: శ్ ! (సైగతో "ఊర్కో" అన్నాడు.)

చెవి : ఏందో లే దొరా - ఆళ్ళు ఆళ్ళే - ఈళ్ళు ఈళ్లే! (అంటూ ద్వారంవద్ద కూలబడ్డాడు. అలవాటు ప్రకారం పంకా త్రాడు చేతికొచ్చింది; లాగుతున్నాడు.)

వెంక : పంకాలాగి మమ్మల్నెందుకు చంపుతావురా బాబూ! వుూరోᳲ!

సత్యం: లాగించుకోరాదట్రా! చల్లగా వుంటుంది.

వెంక : కడుపులోమాత్రం మండుతుంది. అవునుగానీ—ఈమధ్య వీరి కందరికీ నాయకుడైనట్లున్నావే!

సత్యం: అవునురా! వచ్చేసారన్నా మంత్రిపదవి లభిస్తుందే మోనని,

వెంక : అప్పుడు సెక్రెటరీ పదవైనా నా ముఖాన పారేస్తావా?

సత్యం: ఈసారి అయివుంటే నీకిద్దామనుకున్నాను. వచ్చే సారికి అలోచిద్దాం.

వెంక : అదె ఆ విషయం ముందుగా చెప్పివుంటే నీకు Canvass చేసే వాడినే! వచ్చేసారైనా చెప్పు.

సత్యం: వచ్చేసారిగూడా ఎలెక్షన్లు ఇంత కుళ్ళుగానే జరుగు తాయంటావు?

వెంక : ప్రపంచం త్వరలోనే ఏదో గొప్పగా మారుతుందని నీకేదో వెధవాశ వున్నట్లుందే!

సత్యం: మారకుండా అలాగేవుంటే ప్రాణం లేదన్న మాట లోకంలో.

వెంక : విప్లవం రాబోతూందని గట్టిగా నమ్ముతావు.

సత్యం: తప్పక.

వెంక : అందుకే నిన్ను "కమ్యూనిష్టు మిత్ర" అంటారు.

సత్యం: ఎవరు—కాంగ్రెసు గోత్రీకులా?

[ కోటిగాడు వచ్చాడు ]

కోటి : అయ్యగారు చాలా తొందర పనిగా వెళ్తున్నారు. మంత్రిగారొస్తారు, తర్వాత మాట్లాడొచ్చని చెప్పమన్నారు.

సత్యం: వెళ్ళారా ?

కోటి : ఆఁ.

సత్యం : ఎటు వెళ్ళారు ?

వెంక : ఓరి పిచ్చివాడా ! అంతపనికి మాలిట్రా మహరాజు లిళ్ళల్లో ఇన్ని దర్వాజాలు పెట్టివుండడం. అన్ని ద్వారాలే లేకుంటే నీబోటివాళ్ళనుండి, దానాలు ధర్మాలకొచ్చే వాళ్ళనుండి తప్పించుకొని వూపిరితో బైటపడగలరా చెప్పు ?

కోటి : ఏంటండీ ?

వెంక : నీతో కాదు. (కోటిగాడు ఈ మాటలతో వెళ్తాడనుకున్నాడు కానీ వాడింకా వుండటంచూచి) ఆనందయ్య వచ్చేవరకు ఇక్కడే వుండటానికి అయ్యగారి వుత్తరువు తీసుకున్నాం.

[ కోటిగాడు మొహంమీద చేయివేసి వెళ్ళాడు ]

సత్యం : హుఁ–! ఛీ ఛీ ! డబ్బున్న మాత్రాన సరేనా ?

వెంక : అట్లా అనుకొని నువ్వూ నేనూ గర్వపడాల్సిందే !

సత్యం: నన్ను చూస్తే ఎందుకురా అలా గాబరా పడిపోతాడు ?

వెంక : గాబరా పడికాదు – నువ్వు కమ్యూనిస్టువని,

సత్యం: అయితే ?

వెంక : కమ్యూనిస్టుల గాలి సోకేంత దూరంలో వుండవద్ద న్నారు.

సత్యం: అంతమాత్రానికి ఈయన మహా కాంగ్రెసు అయి పోతా డనేనా ?

వెంక : అంతేగా ? కమ్యూనిస్టులను తిట్టిన వెంటనే కాంగ్రె సవుతారు.

సత్యం: నీ అభిప్రాయం కూడా అదే నంటావు ?

వెంక : మహాప్రభో ! నీకో క్షదండం ! నువ్వు నన్ను మాత్రం రాజకీయాల్లోకి లాగొద్దు. ఇంకేదైనా మాట్లాడు. నాగయ్య సంగీతాన్ని గురించి, రామయ్యర్ కాఫీని గూర్చి, కోమటమ్మ ఇడ్లీలను గురించి, ఏదన్నా మాట్లాడు. సరేనా ?

సత్యం: అదేమిట్రా నువ్వు రాచకీయాలకంత పెద్ద నమస్కారం కొడుతున్నావు ?

వెంక : నువ్వూ నమస్కారం అనేకాలం వస్తుంది. అప్పుడు కారణం నీకే తెలుస్తుందిలే, తొందరెందుకూ ?

సత్యం: డెఫీటిసమ్‌లో పడ్డావన్న మాట !

వెంక : బాబూ ! మీ ఇజాలతో చచ్చిపోతున్నాం !

సత్యం: మీరంతా పిరికి పందల్లా !

వెంక : అవును పిరికిపందలమే ! అంతే ! వూర్కో ! నువ్వూర్కో! అరె ! వూరోకోమంటే ! ఆపే !

సత్యం: అంత వుద్రేకం ఎందుకొస్తుందిరా ?

వెంక : ఎందుకొస్తుందా ? చక్కగా తిని కూర్చో లేక! (అమాంతం లేచాడు) ఈ ఎండిపోయిన గుండె నడుగు చెప్తుంది ఎందుకొస్తుందో అంత ఉద్రేకం! (చొక్కా చీల్చి గుండెమీద ఒక్క వేలితో టపటప కొట్టుకున్నాడు. (ప్రేక్షకులకు వినపడ్డదో లేదో కానీ, దగ్గరవున్న ఎవ్వరికైనా ఒకవిధమైన సహింపరాని ఓటిశబ్దం వినిపించింది) నలుగుర్ని వెంటేసుకొని నాయకుడనిపించుకోటం కాదు, రాజకీయ తంత్రాలతో వాళ్ళను వీళ్ళను రెచ్చగొట్టి ప్రజాసేవ అనిపించటంకాదు! ముందుగా అన్ని ఏర్పాట్లు చేసుకొని పూలమాలలు వేసుకొని 'ఎ' క్లాసులో పోయి కూర్చోటం కాదు. జైళ్ళకు పోయివచ్చామనే క్వాలిఫికేషన్‌తో పదవులకు ప్రాకులాట్టంకాదు! 'ఎ' క్లాసులో హాయిగా కూర్చుంటే 'సి' క్లాసులో మురిగి చచ్చింది మేము! కలిగినవాళ్ళు జైళ్ళకుపోయినా కాపురాలు జరిగినవి! మాకు? మింగ మెతుకు లేక మాడిచచ్చాం! వున్న కుండ బొచ్చెలతో సహా ఆంగ్ల సామ్రాజ్యాధిపతుల ఆగ్రహానికి ఆహుతి చేశాం! సత్యాగ్రహాలు చేశాం! లాఠీదెబ్బలు తిన్నాం! బూట్సు కాళ్ళ తన్నులు రుచిచూచాం! క్షయవ్యాధికి బలి అయ్యాం! (కొంచెం ఆగాడు, ఊపిరిపీల్చుకున్నాడు. ఉద్రేకం కొంత అణిగింది) ఎందుకోయ్ నన్ను రెచ్చగొడతావ్! (కూర్చున్నాడు) రాజకీయాలట రాజకీయాలు! ఎవరికి రాజకీయాలు! మాకు కాదు. మంత్రులు కావాలనుకున్న వారికి (తనలో తాను గొణుక్కున్నాడు)

సత్యం: వెంకటాద్రీ! ఇదంతా కేవలం ఓర్వలేని తనంవల్ల పుడుకుమోతు తనంతో అనటం తప్ప వేరేమీ కాదు.

వెంక : ఏమన్నావ్! (తపీమని సత్యంలెంప మ్రోగింది. మాట ముందో దెబ్బ ముందో చెప్పలేం)

[సత్యం అలాగే నిల్చున్నాడు శిలాప్రతిమలాగు. కళ్ళవెంట నీళ్ళు జారినవి. కానీ దెబ్బకు కాదు. వెంకయ్య ఒక్క క్షణం తలవంచాడు; కూలబడ్డాడు. వొక్కసారి సత్యం వంక తలెత్తిచూచాడు...]

సత్యం: క్షమించు వెంకటాద్రీ!

వెంక : (వెంటనే లేచి సత్యం చేతు లందుకున్నాడు.) కాదు నన్నే క్షమించు, తొందర పడ్డాను. (గద్గదం మాత్రం వుంది, కళ్ళనీళ్ళు రాలేదు) ఈ కళ్ళల్లో తడికూడా లేదు నా పశ్చాత్తాపాన్ని ప్రదర్శించటానికి, క్షమిస్తావా? నేను......

సత్యం: నువ్వు కాదు నన్ను కొట్టింది. దేశస్వాతంత్ర్య సమరంలో ప్రాణాలర్పించిన కోటానుకోట్ల త్యాగమూర్తుల అంతరాత్మలు నన్ను కొట్టినవి. కాంగ్రెస్ మహాసంస్థ యొక్క మహత్తర ఆదర్శం, నన్ను నిద్రనుండి లేపటాని కీలెంప పెట్టించింది; నువ్వు కాదు. కాని — వెంకటాద్రీ!

వెంక : నన్ను వెళ్ళనీ–(ముఖం తిప్పేసినాడు)

సత్యం: ఎందుకూ? నేను నీతో చాలా మాట్లాడాలి, కూర్చో.

వెంక : నేను మాట్లాడలేను.

సత్యం: పోట్లాడగలవటోయ్! ఛీ! నువ్వేమీ తప్పుచేయ లేదు. కూర్చో.

వెంక : అదికాదు......నువ్వు......

సత్యం: నేను? ఏం? అడుగూ?

వెంక : కమ్యూనిష్టువు కావూ?

సత్యం: ఎందుకు?

వెంక : అదికాదు. ఏదో అహింసాజ్యోతి నా పీక నొక్కే స్తోంది. నీ ముఖం చూడలేకున్నాను. ఆ ఒక్క క్షణం -ఆ దెబ్బకొట్టిన తర్వాత, నిన్ను చూచాను...గాంధీ మహాత్ముడు నీలో అగుపడ్డాడు.

సత్యం: కవిత్వం మాట్లాడుతావే నువ్వు? పౌరాణిక నాటకాల స్మృతులు తెస్తున్నావేం?

వెంక : కాదోయ్! ఇది హృదయానికి సంబంధించినది. నన్ను నువ్వు సరిగా అర్థం చేసుకోలేదు. ఇంత సహనం ఎలా వచ్చిందోయ్ నీకు!

సత్యం: కమ్యూనిష్టులకు సహనం వుండకూడదేం! ఇంతకూ నేను కమ్యూనిష్టని ఎవరు చెప్పారు?

వెంక : వూళ్ళో అంటున్నారు.

సత్యం: సరే అననీ! మెల్లగా అదీ అర్థమవుతుంది నీకు.

[మోహన్ వచ్చాడు చిన్న కాయితం బొంయ్ అనుకుంటూ. షికారుకు బయలుదేరాడేమో, వెంకటాద్రిని చూచి ఆగాడు]

మోహ: నాన్నగారింట్లో లేరు.

సత్యం: ఈలారా బాబూ!

[ మోహన్ కారుదిగి వచ్చాడు ]

సత్యం: నీ పేరేంటి ?

మోహ: మోహన్.

సత్యం: ఎక్కడ కొన్నావీ కారు ?

మోహ: మెడ్రాసులో.

సత్యం: ఎంత ?

మోహ: ఇన్ని రూపాయలు (చేతులుచూపాడు)

సత్యం: ఏం చదువుతున్నావు ?

మోహ: నాలుగోక్లాసు, నాకు పద్యాలుకూడావచ్చు.

సత్యం: ఆఁ హాఁ! ఏదీ ఒకటిచెప్పు చూద్దాం.

[ మోహన్ కాస్త ఆలోచించి ]

అధరము కదలియు కదలక
మధురములగు మాట లుడిగి మానవ్రతుఁడౌ
అధికార రోగపూరిత
బధిరాంధక శవము జూడ పాపము సుమతీ ॥

[ సాధారణమైన బడిపిల్లల వప్పగింత రాగంలో చదివినాడు. వాకిట్లో కారుహారన్ శబ్దం, కొన్ని కాళ్ళు నడిచినచప్పుడు ]

మోహ: నాన్నొచ్చాడు. (అంటూ పరుగెత్తు కెళ్లాడు.)

వెంక : మనమూ వెళ్దాం. మొట్టమొదటే ఎదురుపడటం దేనికి.

సత్యం: ఏం ? మంత్రిగారు కూడా గాభరా పడతారంటావా ?

వెంక : కాదు. సుమతిశతక పద్యం విన్నాంగదా? పాపమేమో నని ! (వెళ్లారు)

[ ఆనందయ్యా, రామయ్యా, సుబ్బన్న మోహన్‌ని ఎత్తు
కొని వచ్చారు. ఆనందయ్యా పేరుకుతగ్గట్టు వున్నాడు ]

ఆనం: (మోహన్ బుగ్గతాకి) ఆహా! పద్యాలు కూడా వచ్చున్నమాట! (కూర్చున్నాడు) ఏదీ! ఒకటి చెప్పు చూద్దాం. (అందరూ నిలబడి వున్నారు. కారు డ్రైవరు కాబోలు పూలమాలలు ఒక మోపు తెచ్చి టేబుల్ మీద పెట్టివెళ్ళాడు.)

[ మోహన్ సుబ్బన్న వాహనం చాలించి దిగి ఆనందయ్యా దగ్గర నిలబడి ]

దగ్గఱ కొండెము జెప్పెడి
ప్రెగ్గడ పలుకులకురాజు ప్రియుడై మఱి తా
నెగ్గుప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువు బొందుట సుమతీ ॥

[ ఈ పద్యం చెప్తూంటే ఎవరిముఖాలూ అంత బాగాలేవు.
ఆనందయ్యా లేనినవ్వును తెచ్చుకొని "భేష్" అన్నాడు. ]

సుబ్బ: "మంత్రిగలవాని రాజ్యము" పద్యం చెప్పు బాబు!

మోహ: అదినాకు రాలేదు.

రామ: పోనీలే! వెళ్ళి ఆడుకో బాబూ! ఒరే! తీసుకెళ్ళు!

[ ఈ పాటికి కోటిగాడు, చెవిటయ్యా రెండు వైపుల ఆజ్ఞల కోసం ఎదురుచూస్తూ నిలబడి వున్నారు. కోటిగాడు చిన్నబాబును కారులో కూర్చోబెడదామని దగ్గరకెళ్ళాడు. చిన్నబాబు కెవ్వుమన్నాడు ]

మోహ: అమ్మ! నేనురాను! నాకు భయం! కోటిగాడొద్దు!

[ అందరూ నవ్వారు ]

రామ : నీ మీసాలుచూస్తే జడుసుకోడూ మరి !

[ ఇంతలో చెవిటయ్యకు అర్థమైంది. చినబాబును తీసుకెళ్ళాడు ]

రామ: కాళ్ళు చేతులు కడుక్కోండి. కాస్త కాఫీ తీసుకొని
విశ్రాంతి తీసుకుందురు.

[ఆనందయ్య టైంచూచుకొని ఒక్కసారి ఫస్టుక్లాసులో ప్రయాణంచేసిన బడలికంతా విదుల్చుకొని లేచాడు.......... .. ]

రామ: కోటిగా ! బాత్ రూమ్‌కు – (తానూ ఆనందయ్యతో
పాటు ద్వారంవరకు వెళ్ళి తిరిగి వచ్చాడు.)

సుబ్బ : ఇక్కడ ప్రోగ్రాం ఎంతవరకండీ?

రామ: వుంటాడు లేవోయ్ రెండు రోజులపాటు.

సుబ్బ : మరి – ఆ విషయం___

రామ: ఏ విషయం ?

సుబ్బ : అదే ! ఆ వుద్యోగం.

రామ: చెప్తాలే ! తొందర పడకు !

సుబ్బ : ఆనందయ్యకు తమ మాటంటే ఇదేనండీ !

రామ: ఇదిగాక మరేమవుతుందోయ్ ? ఎలక్షన్ రోజుల్లో
పెట్రోలుకు, కార్లకు మనం లేకుంటే ఏమయ్యేవాళ్ళు?
అసలంతకు పూర్వం మాత్రం వీళ్ళంతా మనల్నాశ్ర
యించుకొని జరుపుకున్న వాళ్ళేకదూ ? మొన్న ఎల
క్షన్లలో మాత్రం వీళ్ళు ప్రజాబలంతోనే గెలిచా
రంటావా ? తనంతట తానువచ్చి ఓటువేసిన వెధవ
ఒక్కడూ లేడు. ఏదో మన పలుకుబడి, మన అధికారం

వుపయోగించుకొని వుట్టికొట్టారు. ఇప్పుడు కాదని పోతారా ?

సుబ్బ : అంతేకదండీ - మరి మన బ్లాక్ మార్కెట్ - మన బ్లాక్ మార్కెట్ కేసు విషయంకూడా—

రామ: సరేలే ! అరుస్తావేం ? బుద్ధిలేదూ ?

సుబ్బ : చిత్తం !

రామ: సుబ్బన్నా !

సుబ్బ : అయ్యా !

రామ: ఈ కూలీల, రైతుల గొడవుండే దీన్నికూడా ఇప్పుడే—

సుబ్బ : అవునండి, ఏదో తేల్చేయాలండి.

రామ: తేల్చేదేముంది వాళ్ళతాడు.

సుబ్బ : అంతేనండి. ఠార్కా తుపాకులుపెట్టి పేల్చేయాలండి.

రామ: చివరి కంతేలే ! చూస్తారుగా వెధవలు ! నీలుగుతున్నారు మహా !

సుబ్బ : నీలిగితే నీలిగినట్టే అవుతారు. మనతోనా ఆటలు !

రామ: సుబ్బన్నా !

సుబ్బ : అయ్యా !

రామ: మనం అనుకున్నామే—

సుబ్బ : అవునండి !

రామ: ఆ సత్యం విషయం - ఏమంటావ్ ?

[ సుబ్బన్నకు ఆ విషయం తెలియదు. అందుకని ఏమనాలో తెలియక అవస్థ పడుతున్నాడు... ]

రామ: ఏమంటావురా !

సుబ్బ : ఏ విషయమండీ !

రామ: (తిరిగిచూచి) అరె ! నువ్వా ! కోటిగాడెక్కడ ?

సుబ్బ : ఆనందయ్యతో బాటు వెళ్ళాడండి.

రామ: నే నిప్పుడే మన్నాను ?

సుబ్బ : ఆ సత్యం విషయం—

రామ: ఏమీ లేదు సుబ్బన్నా ! ఏమీ లేదు లే !

సుబ : సరేనండి !

[ ఇంతలో కోటిగాడు కాఫీ ఫలహారం తెచ్చిపెట్టాను.
ఆనందయ్య ఖద్దరుటవల్ తో చేతులు తుడుచుకుంటూవచ్చి ]

ఆనం : ఇంట్లో అంతా ఖద్దరే వాడుతున్నారే !

రామ: ఆఁ ఏదో వుడుతాభక్తి ! ఆడవాళ్లు మాత్రం ఖద్దరు కట్టాలంటే కష్టపడతారు, అసలు—

ఆనం : బయట అప్పుడే గుంపుచేరినట్లున్నారు ?

[ బయట జనసందడి ]

రామ: సుబ్బన్నా ! అటుచూడు !

ఆనం : (ఫలహారం తీసుకోంటున్నాడు, రామయ్య కూడా కూర్చున్నాడు) ఊఁ ! ఏమిటి విశేషాలు వూళ్ళో !

రామ: ఆఁ ఏముంది విశేషాలకు ! అంతా బాగా నేవుంది !... ముఖ్యంమీద నాకు శోచేదేమిటంటే మానవ ప్రకృతే మారిపోయిందండి ! అబ్బ ! ఎంతమోసం, ఎంతకుళ్ళు! అసలు మోసం చేయకుండా వుండాలనుకున్నా కాలం అలా బతకనివ్వదే ! గాంధీగారు ...... (సుబ్బన్న వచ్చాడు) ఏమిటి సుబ్బన్నా !

సుబ్బ : ఆc, ఎవరో అలబరిజనం !

రామ: ఏమిటి ?

సుబ్బ : ఆc, వాళ్ళబొంద !

ఆనం : ఏదో అడిగి రారాదూ ?

సుబ్బ : చిత్తం ! తిండి చాలటం లేదట. మనవి చేసుకోటానికి...

ఆనం : (అప్పుడే నోట్లోకూరిన స్వీటును నముల్తూ) అయితే ఏం చేయమంటారని ?

రామ: ఆc, చేసేదేముంది ? మీరేం బియ్యంమూటలు వేసు కొచ్చారు గనుకనా నెంట ! ఈ కాలంలో ఎవరికి మాత్రం చాలుతూందని ! అందరూ అర్ధకడుపే తింటు న్నారు ! మాబోటివాళ్ళకు మరి......

[ బయట పళ్ళ్యాళ్ళ ఏదో గోల ]

రామ: ఏమిటా గోల ? వెధవలు ! పూహోం-మను, వెళ్ళ— చెప్పవయ్యా ! నీతి పాతిలేని వెధవలు ! సమయం సందర్భం లేదూ ? ఇప్పుడే రైలు దిగి వచ్చేరో లేదో ఇంతలో వీళ్ళపోరా ! కాస్త విశ్రాంతి అయినా తీసుకోనివ్వరే ! మీరేమన్నా అనండి ! అసలు ఈ డెమోక్రసీలో వచ్చే పేచీనే యిదండి ! మన మంత్రి, మనవాడు, మనం పంపామని ప్రతి వెధవా ఆc పూc అంటే మంత్రి దగ్గరకు పరుగెత్తడమే ! అదే ఆ యింగ్లీషువాడుండగా ఒక్కడికైనా దమ్ములుండినవా దగ్గరకు రావటానికి ?

[ సుబ్బన్న అసహ్యంతో కళ్ళుమూసుకొని వచ్చాడు ]

సుబ్బ : ఛీ ! ఛీ ! పాడుమూక !

రామ: ఏమిటి సుబ్బన్నా !

సుబ్బ: ఆడవాళ్ళంతా ఆఫీసుముందు దిగంబరంగా నిలబడివున్నారు. వెధవముండ ! సిగ్గులేదు—బిడియంలేదు !

ఆనం: అదేమిటి ?

సుబ్బ: గుడ్డలు లేవట. చూపించుకోటానికి వచ్చారు.

ఆనం: అలాగా ! (లేచాడు; లేచి జారిన పైపంచ పైనవేసు కున్నాడు.)

రామ: మీరెలా వెళ్తారు ? కూర్చోండి !

ఆనం: మరి వాళ్ళలా వాకిట్లో గోలపెడుతూంటే !

రామ: నేను పంపించేస్తాగా వాళ్ళను......ఇదిగో చూడారా! సత్రంవద్ద 8 గంటలకు వుపన్యాసం ఏర్పాటుచేశాం. నోటీసులుకూడా వేయించాం...ఏలాగుంది ? మీటింగులో అన్ని సందేహాలు, కష్టాలు చెప్పుకోవచ్చుగా!

ఆనం: అవును, మంచిపనే చేశారు.

రామ: సుబ్బన్నా ! ఈ నోటీసులు వాళ్ళకిచ్చిరా ! మొగ్గితే చాలు యీ మొరటు ప్రజకు ! నెత్తినెక్కి స్వారి చేస్తారు. అలాగని నేను ప్రజా వ్యతిరేకిననుకోకండేం ? దేనికిగానీ హద్దూ సమయం వుండాలి. మన ప్రభుత్వం వచ్చిందికదా అని నిల్చున్నపాటునే ఏలాకుదుకుతుంది?

సుబ్బ: (మండిపడుతూ వచ్చాడు) పొగరుబోతు ముండా వాళ్లు ! కాళ్ళు విరగ్గొట్టే వాళ్ళులేక !—

రామ: ఏమిటి సుబ్బన్నా ?

సుబ్బ : వాళ్ళ ప్రారబ్ధం! చెప్పను చెప్పను తలకెక్కుతున్నారు! నోటీసులిస్తే "మాకు సదువేం వచ్చు బాబూ! ఇవి యిస్తే మేమేం చేసుకోను" అన్నారు. మీటింగుందని, అక్కడికి రమ్మని చెప్పాను. మాకు మీటింగులు వుపన్యాసాలు అక్కర్లేదు. తిండీ-గుడ్డ కావాలనిగోల. వెధవ మూక! ఎప్పుడూ తిండీ-గుడ్డే!

ఆనం : సుబ్బన్నా! నా మాటవిను.

సుబ్బ : వింటానండి.

ఆనం : ఆడవాళ్ళ సంగతిని అటు వెళ్ళమను. వాళ్లుండగా నేను రావడం బాగుండదని నచ్చచెప్పు, నేను ఆ మేడ మీదికొస్తాను. మిగిలిన మగజనంతో మాట్లాడుతాను.

రామ: అది మంచిపని!

సుబ్బ : చిత్తం (వెళ్ళాడు)

ఆనం : ఏదో నాలుగు ముక్కలు చెప్పిపంపేయాలి. విజ్ఞానంలేని మూకను విదిలించి ప్రయోజనం లేదు.

సుబ్బ : (వచ్చాడు) వెళ్లారండీ ఆడవాళ్లు!

సుబ్బ : ఇళ్ళకు వెళ్లారా!

సుబ్బ : ప్రక్కకు తొలిగి వున్నారు.

ఆనం : సరే-రాండి పోదాం!

[ ఇద్దరూ మేడమీదికి వెళ్తున్నారు. ]

రామ: ఆ సత్యం కమ్యూనిస్టయి యిదంతా చేయిస్తున్నాడు.

ఆనం : (ఒక్క క్షణంఆగి, తల పంకించి) అలాగా!-(వెళ్ళారు)

[ సుబ్బన్న వాకిట్లోకి వెళ్తున్నాడు ]

వెంక : } (ఎదురుగా వచ్చారు) ఎప్పుడూ తిండీ-గుడ్డ! వెధవ
సత్యం: } మూక !

[ సుబ్బన్న కర్రసి వెళ్లాడు ]

వెంక : నాటకం జరుగుతూంది.

సత్యం: చూస్తున్నాగా !

వెంక : ఈ నాటకం చూస్తేగాని నీకు మనుష్యుల తత్వం తెలిసి రాదు.

సత్యం: ఈలాంటి నాటకాలెన్నో చూచానులే !

వెంక : వాటికీ దీనికీ ఏ తేడా అనుపించటంలేదూ ?

సత్యం: ఊఁ హుఁ !

వెంక : చివరిదాకా చూడు. తెలుస్తుంది. (బయటినుండి) మహాప్రభో ! ఆకలి ! మాడిసల్తుండాం ! పిల్లా జల్లా మల మల మాడుతుండాం ! (లోపల)

వెంక : అదిగో మొదలు పెట్టింది ! (బయట)
దయసూడండి బాబయ్యా ! మీాగూ పిల్లుగంగోళ్ళు !
సూడండి బాబయ్యా యీా అనాదల్ని ! (లోపల)

సత్యం: మంత్రిగారి మాటలు మనకు వినిపించవు !

వెంక : అవును. ఆయనిప్పుడు పైకెక్కినాడుగా !

సత్యం: ఇంకా కొద్దికాలానికైనా దిగిరావాలిగా ! (బయట)

1. మాకు కావాల్సింది తిండీ గుడ్డ !
2. దొంగ మార్కెటు అంతరించాలి !
3. ఎలెక్షనులో ఎన్ని మాటలు చెప్పారు ? మరిచి పోయూరా ? (లోపల)

సత్యం: అసలు వీళ్ళెందుకు మాట్లాడాలి?

వెంక : ఎవరు? కమ్యూనిస్టులా?

సత్యం: కాదు. కడుపు మాడినవాళ్ళకోసం కష్టపడేవాడు.

(బయట)

మానం కాచుకోటానికి గుడ్డపాత లేదుదొరా! అర్ధ కడుపంబలి దొరకటం లేదు దొరా! డబ్బున్నా గింజల కర్రువైంది సెబో! మా మురికిగుంటలోకసారి సూసి పోండి. తెలుస్తది! (కొంతు నిముసాలు మాటలే వినబడవు.)

వెంక : మంత్రిగారు మాట్లాడుతున్నారు కాబోలు! (అకస్మాత్తుగా బయట)

ఇవన్నీ మాకక్కర్లేదు. కబుర్లతో కడుపు నిండదు. రాండశే రాండి! సూడండి! సావా పెల్లాంబిడ్డల్ని!

[ అని ఒక కేకల లోపల ]

వెంక : శ్రుతి మించింది!

సత్యం. కడుపు రగిలింది!

వెంక : ఇంకా ఆనందయ్య గుండెలు పగలకున్నాయా?

సుబ్బ : (విసురుగా వచ్చారు) ఛీ! ఛీ! ఛీ! మరీ తెగబడి వచ్చారు. విప్పేసి పేఘులుసికి వచ్చారు. పాడుజనం!

[ ఆనందయ్య, రామయ్య బయటకు వచ్చారు, ఆనందయ్య సత్యాన్ని చూచి వుగ్రుడయ్యాడు. సత్యం నవ్వి అన్నాడు...... ]

ఆనం : నువ్వ! నువ్వే యీ అరాచకానికి కారణం! (అని కళ్ళురిమి పెద్దగా అరిచాడు) ( తెర జారుతుంది.)



